





# కథలు

## నీతి, పురాణ, పొడుపు

## ఒకే కథ అనేక రకాలు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010006605

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఒకే కథ అనేక రకాలు

(కథాసాహిత్యానికి పాఠ్యగ్రంథము.)

పోలవరపు శ్రీహరిరావు

బిజలీ పబ్లికేషన్సు విజయవాడ.

# అవసరం

ఆంధ్రభాషలో అత్యవసరమైన గ్రంథాలు బహు తక్కువ. విజ్ఞాన సముపార్జనకు అవసరమైన శాస్త్రాలూ, కళలూ శాఖోపశాఖలుగా, బహు ముఖాలుగా వున్నాయ్. అందు ఒక శాస్త్రాన్నిగాని, ఒక కళనుగాని ఒకరు కూలంకషంగా గ్రహించాలంటే—దానికిచెందిన ఆ యా లక్షణాలు గల గ్రంథాలు చదివితే చాలదు. ఒక్కొక్క శాఖకూ ప్రాథమిక పదికనుంచీ, పరాకాష్ఠవరకూ అర్థంచేసుకుంటేనేగాని సమగ్ర జ్ఞానం అలవడదు. మనభాషలో శాస్త్రీయమైన సమగ్ర గ్రంథాలు వేళ్ళమీదలెక్కపెట్టగలన్ని మాత్రమే వున్నాయి. ఒక్కొక్క శాఖనూ సూక్ష్మంగా పరిచయంచేసే ప్రాథమిక గ్రంథాలు దేనికీ కనిపించడంలేదు. ఒక్కొక్క శాఖనూ సామాన్యునికికూడా అర్థమయ్యేవిధంగా దాని ప్రాథమిక లక్షణాలను వివరిస్తూ పరిచయంచేసే గ్రంథాల అవసరం ఎంతోవుంది.

ఇట్టి ప్రాథమిక పరిచయ గ్రంథాలు చదవడంవల్ల పాఠకులు ఆ యా శాఖల ముఖ్యలక్షణాలను అవగాహనచేసుకొని, ఆ యా శాఖల లోతుపాతులను తెలుసుకునే కుతూహలంతో సమగ్రతా, విపులతాగల శాస్త్రీయ గ్రంథాలనుచదువుతారు. సంతృప్తికరమైన కథను చదివి—సినిమాను చూడ కుతూహలపడే మన స్వత్వమే దీనికి రుజువు.

ఇతరభాషలలో యిలాటి పరిచయగ్రంథాలు అనేక శాఖలకు అనేకవిధాలుగా వున్నాయి. వీటిని స్వల్ప వెలకు పొంది చదివినవారు—ఆ యా శాఖలలోని బృహద్గ్రంథాలను చదవడానికి ఎక్కువగా సంసిద్ధులవుతున్నారని ప్రచురణకర్తలు గ్రహించారు. అందువల్ల ఆ యా శాఖల పరిచయగ్రంథాలనే గాక—ఒక్కొక్క బృహద్గ్రంథానికీ ఒక్కొక్క సంక్షిప్త పరిచయాన్ని గాని, క్లుప్తీకరణనుగాని స్వల్పమైన వెలకు ప్రచురించడం ప్రారంభించారు. ఈ ప్రాథమిక పరిచయాన్ని ప్రచురించిన తరువాత తమ బృహద్గ్రంథాల అమ్మకం ఎన్నోరెట్లు పెరిగిందని వారు ప్రకటిస్తున్నారు. అందువల్ల ఈ సాధారణ పరిచయగ్రంథాలు పాఠకులకేగాక, ప్రచురణకర్తలకు కూడా ఎంతో మేలునూ, లాభాన్నీ చేకూరుస్తున్నాయని తేలుతూంది.

మన సాహిత్యవనంలో శీఘ్రంగా, అత్యున్నతంగా పెరిగి పరిణతిపొందినశాఖ—కథాసాహితి. భారతదేశంలోని అసంఖ్యాకమైన యితర భాషలన్నిటిలోకంటె—తెలుగుభాషలోని కథలు విషయము, సంవిధానము, శైలి, ఆదర్శము, పరిణతులన్నింటిలోనూ అత్యుత్తమంగా పేర్కొనదగివున్నాయి. అంతే గాక, ప్రపంచ కథాసాహితిలోకూడా గౌరవస్థానాన్ని పొందినాయి. నిజానికి నేడు మన భాషలో కథలురాస్తున్నంతమంది మరేభాషలోనూ లేరని చెప్పుకోవచ్చు.

ఇంత ఉత్తమస్థాయికి వచ్చిన మన కథాసాహిత్యానికి కూడా పరిచయగ్రంథం మచ్చుకొకటైనా లేదు. నేడు ఒకపాఠకుడుగాని, నవలారచయితగాని మన కథాసాహిత్యాన్ని గురించి తెలుసుకోవాలంటే కొన్నివేల కథలను చదవడంకంటే మరో

మార్గం లేదు. ఒక్కొక కథకునికి ఒక్కొక ప్రత్యేకత ఉండడమే గాక, ఒక్కొక కథకే ఒక్కొక విలక్షణం వుండడం కద్దు గనుక అన్నీ చదవనిదే సమగ్రజ్ఞానం కలుగదు. వ్యయప్రయాసలకోర్చి అలా చదువుదామన్నా అందరి కథలూ అన్ని కథలూ గ్రంథ రూపాన లభించవు. అనేకమందివి అత్యుత్తమ కథలు ఏపత్రిక లోనో ఎపుడో ప్రచురించబడి, ఏకొందరిచేతనో చదువబడ్డాయే గాని—వర్తమాన పాఠకునికి అందుబాటులో లేవు. అందువల్ల కథాసాహిత్యశాఖ జిజ్ఞాసువుకు తలా తోకా తెలియని స్థితి లోనే వుండిపోతూంది.

ఈ కొరతను తీర్చేందుకు అనేక విమర్శక గ్రంథాలూ, పరిచయ గ్రంథాలూ వెలువడవలసివుంది. ఆమధ్య శ్రీ గొర్రె పాటి వెంకటసుబ్బయ్యగారు "అక్షరాభిషేకం" అనే గ్రంథం లో పదుగురు పేరొందిన రచయితల్నీ, వారి రచనల వైవిధ్యాన్నీ పరిచయంచేసి—ఈ కొరతను తీర్చ ప్రయత్నించిన ప్రప్రథములయ్యారు. ఇటీవల దేశికవితామండలి, ఆదర్శగ్రంథ మండలి వర్తమాన ప్రముఖుల కథల సంపుటాలను ప్రచురిస్తూ —ఈవిషయంలో మరికొంత సేవచేస్తున్నాయి. ఏటా సాహితీ సింహావలోకనచేస్తూ ఈ కొరతను సూచిస్తూ సూక్ష్మ విమర్శలను ప్రచురిస్తూ ఎన్నదగిన సేవచేస్తున్నారు శ్రీ శ్రీవాత్సవ. (భారతి, తెలుగు స్వతంత్ర) పత్రికాధిపతులూ, ప్రచురణకర్తలూ విమర్శనాసాహిత్యపు విలువలు గుర్తించి, తగు ఏర్పాట్లుచేసి శ్రీవాత్సవగారిచేత నెలకొక సమగ్రమైన విమర్శనైనా ప్రకటింపజేస్తే మన సాహిత్యానికి ఎంతో సేవ చేసినవారవుతారు.

ఇంతకీ—మన కథాసాహిత్యాన్ని పరిచయంచేసే గ్రంథాలు లేవనే తేలింది. ఈ లేమికారణంగా మన కథాసాహిత్యానికి ఎన్నో విధాలుగా లోసుగులు సంభవిస్తున్నాయి. ఈ లోటుపాట్లు కథాసాహిత్యశాఖతో సన్నిహిత సంబంధం గలవారికిగాని బాగా అవగాహనకావు. పదహారేండ్లుగా—రచయిత, సంపాదకుడు, ప్రచురణకర్త—అన్నిటికంటే ముఖ్యంగా పాఠకుడుగా నాకు యీ శాఖతో పరిచయంవుంది. నాకు తెలిసినంతలోనే ఈ లోటు తీరనంత పెద్దదిగా కనిపించింది.

సాహిత్యపు ఇతర రూపాలకంటే—కథారూపాలను చదివేపాఠకు లెక్కువగా వున్నారు. కాని, బహుకొద్దిమంది మాత్రమే వాటి మంచిచెడ్డలను సవిమర్శకంగా తెలుసుకోగలుగుతున్నారు. అంటే అధికసంఖ్యాకులకు కథలను విచక్షణా దృష్టితో చదవడం తెలియదన్నమాట. విచక్షణారహితమైన చదువు ఊసుపోకకు దప్ప—విస్తృత ప్రయోజనకారి కాదుగదా! సాహిత్యప్రయోజనం "ఊసుపోక" కాదుగదా!

పాఠకులలో అనేకమంది అనేకకథలు చదవడంవల్లా తమతమ చిత్తసంస్కారాలనుబట్టీ తాముకూడా చెప్పవలసిన కథలు తమ మనసుల్లో వున్నాయని గ్రహిస్తారు. కొన్నికొన్ని కథల్లో తమ అనుభవాలే చిత్రింపబడినట్లు తాదాత్మ్యత పొందినవారు—తమ యితరఅనుభవాలుకూడా కథలుగాచెప్పదగినవనికూడా గ్రహిస్తారు. కొందరు తమతోటివారు కథకులని తెలిసి, తామూ అలా రచించాలని ఉబలాటపడతారు. కొద్దిమందికి ఊహాపోహ లెక్కువగావుండీ, అనుభవాల అంత

ర్శిమర్శకు లోనయ్యో కథలద్వారా తమ హృదయాన్ని పదుగురకూ విప్పిచెప్పాలని కుతూహలపడతారు.

ఆ యా కారణాలవల్ల ఉత్సాహితులైన పాఠకులు వెంటనే రచయితలు కాలేరు. కొందరు కొంత వ్రాసిన తరు వాత విఫలత్వాన్ని గ్రహిస్తారు. కొందరు ప్రారంభంలోనే బెంబేలుపడిపోతారు. మరికొందరు ఏదో ఒకవిధంగా పూర్తి చేసినా తృప్తిపడలేరు. తాము వ్రాసినది తమకే నచ్చక నిస్పృహ చెందుతారు. కొద్దిమందిమాత్రం ధైర్యంచేసి తమరచనల్ని ఏ పత్రికకో పంపుతారు. అవి బాగుంటే-సంపాదకునకు నచ్చితే-ప్రకటింపబడి, ఆ పాఠకులు రచయితలు కావడానికి దోహద మిస్తాయి; లేదా తీవ్రాఘాతం కలుగుతుంది. నచ్చనిరచనలు త్రిప్పిపంపడంతప్ప-"ఫలానామార్పులవసరం, ఫలానాకారణం వల్ల బాగుండలేదు" అని సూచనలు చేసేంత తీరుబడి పత్రికా సంపాదకుల కుండదు గనుక, రచనలు పంపిన క్రొత్తవారికి ఒరవడీ, చుక్కానీ లభించవు. అందువల్ల వారు పదేపదేవ్రాసి, తిరస్కరింపబడి, తమకు తాముగా సంస్కరించుకుని క్రమంగా అనేక ఢక్కామొక్కీలుతిని రచయితలుగా పరిణామంచెందడం, తప్పితే పాఠకులుగానే వుండిపోవడం జరుగుతూంది.

ఈ కారణంగానే పత్రికలకార్యాలయాలకు నిత్యో వందలాది క్రొత్తవారి రచనలు వస్తూంటాయి; కాని నూటి కొక్కటికూడా ప్రచురింపబడదు. వారానికి ఆరుకథలు మా త్రమే కావలసిన పత్రికకు ఆరువందలకు మించిన రచనలు వస్తాయి. కాని, నచ్చేరచనలు ఆరుకూడా దొరకవు. అందు వల్ల నచ్చనివి—గుడ్డిలోమెల్లగా వున్నవికూడా ప్రచురించుతూం

టాయి పత్రికలు. అయినా మిగిలిన 594 రచనలూ నిష్ప్రయోజనాలేగదా! (మంచిరచనలుకూడా ఒక్కోసారి సంపాదకుని అభిరుచీ, దృక్కోణాలనుబట్టి నిరాకరింపబడే విషయాన్ని ఖాతరుచెయ్యనక్కరలేదు.) ఈ నిరాశాభరితమైనస్థితికి కారణమేమిటి? రచించాలనే ఉత్సాహం ఉన్నవారికి తగు మార్గదర్శనం లేకపోవడమే.

అందువల్లనే కొత్తరచయిత లనేకులు తమరచనలతోపాటు "ఈ రచన అంగీకారయోగ్యం కాకపోతే, కారణాలు తెలుప ప్రార్థిస్తున్నాను. లేదా సవరించ గోరుచున్నాను." అంటూ బ్రతిమలాడే ధోరణిలో ఉత్తరాలు వ్రాస్తూంటారు అనేకమంది తమకుతెలిసిన కథకుని ప్రాధేయపడుతూ-"కథలు రాయడం నేర్పరూ? లేకపోతే, ఎలా రాయగలనో చెప్పరూ? ఏం చదివితే కథలురాసేపద్ధతి తెలుస్తుందండీ?" అని రకరకాలుగా అడుగుతూంటారు. ఇలాంటి అసంఖ్యాకులైన ఉత్సాహవంతులందరికి మార్గదర్శకులు లేకపోవడం వల్లనేగదా - వారు నిరాశాహతులై, తమభావాలను తమలోనే మురగబెట్టుకుంటున్నది? ఈ కొరత తీర్చవలసిన అవసరం లేదంటారా?

"ఈ కొరత వున్నంతమాత్రాన కొత్త రచయితలు తయారుకాకుండాపోరు; తయారవుతూనే వున్నారుగదా" అని కొందరు తృప్తిపడవచ్చు. కాని, కొత్త రచయిత లెలా తయారవుతున్నారు? సవిమర్శకంగా అనేకకథలు చదివినవారు కథకులు కానచ్చు. అనేకవందలసార్లు వ్రాసిందే వ్రాసి దిద్దుకొని, చింపుకుని, మళ్ళీవ్రాసి,, పత్రికలకంపి——హైన ఒక

సందర్భంలో ఉపహరించినట్లు—గుడ్డిలో మెల్లగా వున్నా ప్రచురింపబడి, ఆ ప్రోత్సాహంతో మరికొందరు రచయితలు గావచ్చు. శైలి, ఆదర్శము, వైవిధ్యము లేకపోయినా—ఏదో ఒక కొత్తదనంవల్ల, ప్రత్యేక కారణంవల్ల, చమత్కారంవల్ల, విలక్షణంవల్ల ఒక్కొక్కకథ ప్రచురింపబడవచ్చు. రచన విశిష్ట తనుబట్టిగాక—రచయిత గత కీర్తినిబట్టీ, సంపాదకుని సానుభూతినిబట్టీకూడా కొన్ని ప్రకటింపబడవచ్చు.

ఇలా అనేక అసమగ్ర న్యాయాల కారణంగా కొన్ని కథలు ప్రచురింపబడినంత మాత్రాన అందరూ "కథకులు" కాగలరా? అంతేకాదు—అతడే నేర్చుకుంటాడని బిడ్డకు మాటలు నేర్పడం మానవచ్చునా? దోహదమూ, ఒరవడీ, చుక్కానీ ఉండడం మంచిదా, ఎవరికివారు అమూల్యకాలాన్నీ, ఓపికనూ వెచ్చించి అలవరుచుకోవడమే ఉత్తమమా? ఆ యా ప్రశ్నలకు సమాధానంగా—మార్గదర్శక పరిచయగ్రంథాల అవసరం ఎంతైనావుంది అని ఒప్పుకోకతప్పదు.

అయితే—ఇలాటి గ్రంథాలు క్రొత్తరచయితలకు పాఠ్యవాచకాలుగా ఉపయోగపడేందుకే గాదు—రచయితలుగా వుంటున్నవారు తమ రచనాశక్తిని వృద్ధిచేసుకునేందుకు కూడా ఉపయోగపడాలి. ఇవి కథల మంచి చెడులను సవిమర్శకంగా నిర్ణయించుకునే శక్తిని పాఠకులకు కలిగించాలి. విషయము, సంవిధానము, శైలి, ఆదర్శము, పరిణతి—అన్నిటినీ, అందరికీ సులభంగా విడమరచి చెప్పేవిగా వుండే గ్రంథాలు కావాలి.

ఈ అవసరాన్ని గుర్తించిన నేను బహుకాలం నాలో నేనే మథనపడి—ఈ పుస్తకాన్ని సమకూర్చాను. ఇది తెలుగు భాషలో ప్రప్రథమ ప్రయత్నమైనప్పటికీ బహుళ ప్రయోజనకారిగా తయారుచేయ ప్రయత్నించాను. ఇది తెలుగు కథానికల విషయికంగానేగాక—ఏ భాషా కథాసాహిత్యానికైనా ప్రామాణికంగా తీసుకోదగ్గదని నా నమ్మకం.

అయితే, ఇదే "సర్వజ్ఞత్వం" గలదనిగాని, ఇంతకు మించిన పద్ధతి లేదనిగాని అనబోను. తెలుగు సాహితీ సేవకు ఇదొక అపూర్వ విధానమనిమాత్రం అంటున్నాను.

నా కృషి నాతోనే కాపురం చేయకుండా ఆంధ్రమహాశయులందరి సేవకూ సిద్ధంచేసి, నా ఆశయ సఫలతకు దోహదమిచ్చిన ప్రచురణకర్తలకు కృతజ్ఞుడను.

నా యీ ప్రయత్నంలోని మంచి చెడులను సవిమర్శకంగాచూచి, నాకు తెలియజేసి, నా భవిష్యత్ కృషికి దోహదమిమ్మని పాఠకులనూ, రచయితలనూ, విమర్శకులనూ, సంపాదకులనూ ప్రార్థిస్తూ—అది మీ మీ బాధ్యతయని సవినయంగా మనవిచేస్తున్నాను.

ఇట్లు

**పోలవరపు శ్రీహరిరావు**

C/o "ప్రజామత"

బెంగుళూరు-4

# ఒకేకథ అనేకరకాలు

## కథానిక, కథ, కథనం :

మన పాఠకులు, రచయితలలో అనేకమందికి కథా సాహిత్యంలోగల ముఖ్యవిభాగాలైనా తెలియవు. ఇది అతిశయోక్తికాదు - అనుభవపూర్వకంగా గ్రహించి చెబుతున్న సత్యమే. దీనికి రుజువుగా కొన్ని కథల పత్రికలను తీసి చూచుకుంటే చాలు. ఒక లక్షణంగల రచనకు మరో లక్షణపు పేరు పెట్టడం తరచుగా జరుగుతూంది. ఆమధ్య ఒక ప్రముఖ పత్రిక "కథానికలపోటీ"ని నడిపి—"కథల"కు బహుమతులిచ్చినదంటే, యీ విభాగసమస్య ఎంత అధ్వాన్నంగావుందో ఊహించవచ్చు. ప్రాథమిక పరిచయగ్రంథాల అవసరం ఎంతటిదో యీ ఒక్క సమస్యే తెలియజేస్తున్నదికదా!

కనుక, మనం ముందుగా కథాసాహిత్యంలోని మూడు ముఖ్య విభాగాల లక్షణాలను నిర్ణయించుకోవడం మంచిది. ఆంగ్లంలో షార్ట్‌స్టోరీ, స్టోరీ, స్కెచ్ అనేవాటిని మనం వరుసగా కథానిక, కథ, కథనం అని చెప్పుకోవాలి. కథానికను "చిన్నకథ" అనీ, "కథనం"ను "చిత్రణ" "గల్పిక" అనీ, కొన్ని కథలను "పెద్దకథ"లనీ కూడా వాడుతున్నారు.

ఒక సుప్రసిద్ధ కథారచయిత తమ నూరేసి పేజీలకు మించిన కథలనుకూడా "చిన్నకథ"లనే పిలిచారు. "ఆనంద వాణి" అతి చిన్న సంఘటనలకు ఒక్కోసారి "పెద్దకథ" అని పేరు పెట్టేది. ఈ రెండూ చమత్కారంకోసం వాడబడినవనే మనం నిర్ణయించుకోవాలి. వాస్తవానికి ఈ కథావిభాగరూపాల్ని మనం ఆంగ్లంనుంచే గ్రహించాము గనుక— ఆ భాషలోని ఆచారాలనే అనుసరించడం న్యాయం. ఇతరంగా ఎవరికిచ్చవచ్చినట్లు వారు వ్యవహరించడంవల్ల——చివరికి, ఈ విభాగాలకు అర్ధమే లేకుండాపోతుంది.

" ఒకే ఒక సంఘటనను చిత్రించి విషయాన్ని చెప్పేది కథానిక. అంటే మనం ఏ సంఘటనతో కథను ప్రారంభించామో ఆ సంఘటన మాత్రమే ఆ కథలో వివరించబడి ఆ సంఘటనాంతంతోనే ఆ కథాంతం అయితే—అది కథానిక."

ఒకటికంటే ఎక్కువ సంఘటనలతో ఒకే ప్రయోజనాన్ని, లేదా ఒకే ఆదర్శాన్ని దృష్టిలోపెట్టుకుని చెప్పేది కథ. కథలో ఒక ఆశయాన్ని లేదా ఒక ప్రయోజనాన్ని చిత్రించడమే ముఖ్యం గాని, ప్రస్తుతము కొందరు కథకులు చేస్తున్నట్లు—ఒక జీవితాన్నంతటినీ చిత్రించడంకాదు. జీవిత చరిత్ర చిత్రించేది కథ కాజాలదు.

కథలో మనం చెప్పదలచుకున్న విషయాన్ని కథా నాయకీ నాయకుల పరంగా చెప్పకుండా— ఇతర పాత్రల సంభాషణద్వారా గాని, కొన్ని సంఘటనల సూచనలతో గాని చెప్పేపద్ధతిని—"కథనం" అనాలి. ఈ పద

తిలో ఒకేఒకవ్యక్తియొక్క గుణగణాలుగాని, ఒకే ఒక ఆదర్శముయొక్క బహుళార్థాలుగాని చిత్రించబడాలి. ఎక్కువ మందినిగురించీ ఎక్కువ ఆశయాలనుగురించీ చిత్రించినట్లయితే అన్ని "కథ" గా మారిపోయే ప్రమాదం వుంది.

ఈ మూడు భేదాలూ ముందు పేజీలలో మీకు సోదాహరణంగా తెలియగలవు.



## కథావిషయం:

"కథకుడు విజయుడు కావాలంటే ఉదాత్తమైన కథా విషయాన్నే తీసుకోవాలి." "ప్రజాసమస్యల్ని చిత్రించి, పరిష్కారమార్గాల్ని చూపించినవాడే అభ్యుదయ కథకుడు." "ఒక సమస్యను యథాతథంగా చిత్రించడమే కళ". "ఒక సమస్యను వివిధ కోణాలలో చూపించడంలోనే వుంది - కవి ప్రత్యేకత". "ఉత్తమమైన కళ - ఆదర్శాలు బోధించదు - ఆలోచనలు రేకెత్తింపజేసి ఆదర్శపథాన్ని వెదుకజేస్తుంది".

ఈవిధంగా రచయితలకు అనేకరకాలైన ఆదేశాలిస్తూంటారు విభిన్న వ్యక్తులు. మనం ఆ యా ఆదేశాల మంచి చెడులను తెలుసుకునేముందు ఒక అజరామర సత్యాన్ని మాత్రం గుర్తుంచుకోవాలి. జీవితంలోని ప్రతిక్షణమూ, అనుభవంలోని ప్రతిసంఘటనా, సంఘంలోని ప్రతిసమస్యా, ప్రతి పరిణామమూ, ప్రకృతిలోని ప్రతిదృశ్యమూకూడా కథా వస్తువుగా వుండదగినదే. అయితే, దాన్ని చిత్రించడంలోనే కథకుని నైపుణ్యత వుండాలి. ఆ నైపుణ్యతే విజయానికి కారణమవుతుంది. ఇదీ కథకుడు మరువరాని సత్యం.

అందువల్ల మనం కథావిషయంకోసం ఎక్కువకాలాన్ని వ్యయంచెయ్యకుండా ఒక అతి సామాన్య సంఘటనను తీసుకుందాం. ఆ సంఘటనను ఎన్నివిధాలుగా వీలుంటే అన్ని విధాలా రచించుకుని, తరతమ భేదాలూ, మంచిచెడులూ సోదాహరణంగా గ్రహించుదాం.

# అ స లు క థ :

## 1

రోడ్డుమీాద ఒక రిక్షాలో ఒక స్త్రీ ప్రయాణం చేస్తు న్నది. వెనుకనుంచి ఒక పురుషుడు "ఆగూ, ఆగవోయ్" అంటూ పరుగెత్తుకొచ్చి – "తిప్పు వెనక్కి" అన్నాడు. స్త్రీ "వద్దు, పోనియ్ ముందుకి" అంది. "వద్దు. రమ్మంటూాంటే" అన్నాడు పురుషుడు.

♦ ♦ ♦ ♦

—అంతే నీవుచూాచిందీ, విన్నదీను. ఇంతలో నీకేదోపని తగిలి అక్కడనుంచి వెళ్ళిపోయా వనుకుందాం. నీవు ఈ చిన్న సంఘటనను ఎలా అర్థంచేసుకుంటావో; ఏం జరిగింది, ఏం జరుగుతుంది, అని వూహించగలవో – ఒక గంటసేపు ఆలో చించి చూడు.

# 2

ఆరోజున నేను ఏదో తీవ్రంగా ఆలోచించుకుంటూ రోడ్డుమీద నడుస్తున్నాను. కొంతదూరం వెళ్ళేసరికి నా ప్రక్కనుంచి ఒకరిక్షా గణగణమోగుతూ పోయింది. ఆ ధ్వనికి నా ఆలోచనలు చెదిరి, తలెత్తి చూచేసరికి—"ఆగూ, ఆగి పోయ్" అని కేకవేస్తూ ఒక పురుషుడు పరుగెత్తుకొస్తూ కనిపించాడు.

అతడు రిక్షాను సమీపించి "తిప్పు—వెనక్కి" అని గర్జించాడు. రిక్షావాడు ఆగి, బిక్కమొగంవేసి, రిక్షాలోని స్త్రీ వైపు జాలిగా చూచాడు. ఆమె పళ్ళు బిగబట్టి—"వద్దు పోనియ్ ముందుకి" అని రిక్షావాణ్ణి ఆజ్ఞాపించింది రిక్షావాడు వాహనాన్ని లాగబోయాడు.

పురుషుడు కదులుతున్న రిక్షా చక్రాన్ని గట్టిగా పట్టుకుని ఆపుతూ—స్త్రీతో "వద్దు...పోవద్దు...తిరిగి రమ్మంటూంటే—నీక్కాదూ. చెబితే వినవేం? తిరిగిపోదాం పద" అన్నాడు మందలింపు స్వరంతో. ఆమె పమిటచెంగును శరీరం చుట్టూ కప్పుకొని, అతనివైపు చూడకుండా—"నేను రాను; ...ఛీ అంటే పోయి, పిలిస్తే వచ్చేందుకు నేనేం కుక్క ననుకున్నారా...పొమ్మన్నారుగా—పోతాను" అంది.

అతడు అటూయిటూ ఆదుర్దాగా చూచాడు. అప్పుడే నలుగురైదుగురు ఈ దృశ్యాన్ని చూడ్డానికి పేవ్‌మెంట్లమీద నిలిచారు. అతను స్వరాన్ని తగ్గించి—"నడిబజారులో నన్ను

నవ్వులపాలు చెయ్యకు...ఇంటివద్ద అన్నీ మాట్లాడుకుందాం, పోదాం పద..." అంటూ బ్రతిమాలాడు.

ఆమె చుట్టూ చేరుతున్న జనాన్ని చూచింది. బిగబట్టి వున్న పెదిమలు విడివడ్డాయి. పమిట చెంగును నెత్తిమీదికి లాక్కుని తల దించుకుంది. సిగ్గుపడుతున్న అతని కళ్ళను చూచింది. "తిప్పరా రిక్షా" అంది. ఓపక్కకు జరిగి పక్క నున్న చోటును చూపుతూ పురుషునితో "ఎక్కండి" అంది.

అతడు ఛెంగున గంతేసి రిక్షా ఎక్కి కూచున్నాడు. రిక్షా వెనక్కు తిరిగి గణగణమంటూ పోయింది.

* * *

ఇది "కథానిక"కు ఒక మచ్చుతునక. ఇంత చిన్న కథానికలను మనం ఎంతో అరుదుగాగాని చూడం. అందువల్ల "ఇదీ ఒక రచనేనా?" అనే అలసభావం, అనుమానం అనేకులకు కలుగుతుంది. కాని, రచనను పేజీలసంఖ్యనుబట్టి కొలవగూడదు. వెయ్యిపేజీల నవలలో గ్రహించదగిన విశేషం ఏమీ వుండకపోవచ్చు. మూడువాక్యాల కథానిక మనల్ని మూడురోజులు ఆలోచింపజేయవచ్చు. కనుక ఏ రచననైనా వైశాల్యాన్నిబట్టి గాక విషయపుష్టినిబట్టి తరతమాలు నిర్ణయించుకోవలసివుంటుంది.

పైన వ్రాసినది పూర్తిగా, అన్నివిధాలా "కథానిక" అందులో ఒకే సంఘటనతో విషయం చెప్పబడింది. ఆ విషయం ఒకరిద్దరి మనస్తత్వాలను తెలియజేస్తోంది. పరి సరాల ప్రభావంతో మానవుల మనస్తత్వాలు ఎంత త్వరగా మారుతాయో చిత్రిస్తోంది. ఇంకా కాస్త ఆలోచిస్తే—

ఒక ఆదర్శాన్నికూడా ప్రతిబింబిస్తూన్నది. ఈ విషయాన్ని చెప్పడంలో క్లుప్తత వుండడంవల్ల—నిగూఢమైన శైలి ఏర్పడింది. అంటే పాఠకులు ఒక్కొక్క వాక్యాన్ని గురించీ ఆలోచించుకుంటూ విషయపు లోతును గ్రహించవలసిన శైలి అనుసరించబడింది ప్రతివాక్యానికీ స్థూలంగా కనిపించే అర్థాన్ని మించిన విస్తృతమైన అర్థం లోపింపజేయబడింది.

మరొకసారి ఈ కథానికను చదువుతూ ఆ యా లక్షణాలను గమనించండి. ఇంత తక్కువలో యిన్ని సౌష్ఠవాలు చేకూరినందున ఇది విజయవంతమైన రచన అనబడుతుంది. ఈ పరిణతి, ఈ నిగూఢత్వం ముందు ముందు ఉదాహరణల ద్వారా యింకా తేలికగా అర్థంచేసుకోవచ్చు.

కథ వ్రాయడం ఒక యెత్తు—దానికి తగ్గ పేరును పెట్టడం మరొకయెత్తూను. ఉత్తమమైన కథకు ఏపేరు పెట్టినా దాని విలువ మారదు అని అనేకమందినమ్మకం. కాని, పేరును బట్టి కథకున్న విలువ పెరగడం లేదా ఆకర్షణ పెరగడం జరుగుతుందనే సత్యాన్ని ఎవరూ కాదనరు. ఈకారణంగానైనా "పేరుకు" తగు ప్రాధాన్యత నీయక తప్పదు. ఒకోసారి 'పేరు'వల్ల కథలో ఉద్దేశింపబడిన విలువలు వికృతం కావడం కూడా కద్దు. ఈ సంగతి మీకు ముందు ముందు వివరిస్తాను.

ఇప్పుడు మనం చెప్పుకున్న "కథానిక"కు ఏ పేరు తగి వుంటుందో చూద్దాం. దీనిముఖ్యాశయం ఆ స్త్రీలో కలిగిన మార్పును సూచించడమే గనుక "మార్పు" అనే పేరు సరి పోతుంది. కొందరికీ సులభమైనపేర్లు నచ్చకా, నోటినిండా పలికే మాటలపై మోజువల్లా పెద్దపెద్ద పేర్లకోసం శ్రమపడ

తారు. ఇది అనవసరం. నిరాడంబరత్వమూ, సూక్ష్మతా పాఠకులకు సూటిగా అర్థమై ఆహ్వాయతను పొందుతాయని వీరు గ్రహించాలి రచనల గొప్పదనం భాషా పాండిత్యాన్ని బట్టి గాక - భావపాటవాన్ని బట్టి ఏర్పడుతుందనేది వీరు గుర్తుంచుకోవాలి.

కాగా; ఈ "కథానిక"కు 'పరివర్తన' అనే శీర్షిక నుంచడం తప్పుఅవుతుంది. ఈ పదానికి 'మార్పు' కంటే లోతైన అర్థంవుంది గనుక వృథాపుచ్ఛడమవుతుంది. పురుషుడు చేసిన అవమానానికి అలిగి వెళ్ళిపోతున్న స్త్రీ—మళ్ళీ పురుషునివైపే మళ్ళింది గనుక, దీన్ని "తిరుగుముఖం" అనీ, "హిందూసతి", "భారతనారి", "ఆడది", "బానిస", "దాలిగుంట", "కుక్కబుద్ధి", "సైదోడు", "ధర్మపత్ని" "సుశీల" "దాస్టికవిజయం" మొదలైన అనేక పేర్లతో పిలువవచ్చును. కాని, యీ పేరులకు తగినంత 'నొక్కిచెప్పడం' యీ కథానికలో లేదు.

ఆమె మార్పుకు కారణాన్ని సూచిస్తూ "సిగ్గుచేత" "—హవ్వ ! లోకం—"; "ఏమనుకుంటారు?!" "నవ్వుతారని", "లోకానికి లోబడి" మొదలైన శీర్షిక లుంచడం చమత్కార పద్ధతి. లేదా ఆ మార్పుకు కారణాన్ని గ్రహించమని పాఠకులకు సూచించే—"కారణం", "కారణం?" "ఎందువల్ల?", "ఎందుకనో!" వంటిపేర్లుకూడా పెట్టవచ్చును. ఆ యీ పేర్లుపెట్టేటప్పుడు కొన్నికొన్ని విరామచిహ్నాలనుబట్టి కూడా అర్థాలు మారుతాయని పై ఉదాహరణలనుబట్టి గ్రహించాలి.

అయితే:—పేరుపెట్టినతర్వాత కథ వ్రాయాలా, వ్రాసిన తర్వాత పేరుపెట్టాలా—అనేదికూడా ఆలోచించవలసిన సమస్యే. ఒక ప్రత్యేకోద్దేశాన్ని పాఠకులలో కలిగించేశం కోసమే మనం రచిస్తాం. ఆ వుద్దేశాన్ని చిత్రించడానికి అనువైన సంఘటనలనూ, వ్యక్తులనూ, మాటలనూ కూర్చడం వల్లనే రచయిత కృతకృత్యుడవుతాడు. అందువల్ల మనం చెప్పదలచిన విషయానికి తగిన శీర్షికను ముందే వ్రాయడం మంచిది. అలా పేరుపెట్టుకోవడంవల్ల దానికి తగినట్లు రచనలో 'నొక్కి-చెప్పడం' కోసం మనం ప్రయత్నిస్తాం. ఆ పేరు మన కొక 'ఒరవడి' (మేలుబంతి) వలె సాయపడుతుంది. ఉద్దేశాన్ని మించి అటూయిటూపోకుండా నడిపే చుక్కానిగాకూడా సాయపడుతుంది. కనుక, ముందే పేరును ఎన్నుకోవడం ఉత్తమపద్ధతి.

అలాగాక, కథను వ్రాసినతరువాత పేరును ఎంచుకోవడంవల్ల—నిశ్చితాభిప్రాయంలేకుండా కథకుడు రచన చేసినట్లూ, మధ్యమధ్య స్వైరవిహారి అయినట్లూ విమర్శనా దృష్టిగలవారికి తెలుస్తుంది. ఇది అరుదుగా అనుసరించవలసిందేగాని, ఉత్తమ పద్ధతికాదు.



4)

# 3

ఒకనాడు ఉదయం బంధువులను సాగనంపడానికి బస్ స్టాండుకు వెళ్ళి, ఆలస్యమైనందువల్ల హడావుడిగా తిరిగివస్తు న్నాను. బజారులోని మానవప్రవాహాన్ని గమనించకుండా తలొంచుకుపోతున్నవాడినల్లా "ఆగూ-ఆగవోయ్" అనే గావుకేకలు వినిపించేసరికి ఆగిపోయాను నన్నే ఎవరైనా పిలు స్తున్నారేమోనని చుట్టూ చూచాను. అలాంటి సూచనలేమీ కనుపించలేదు.

ఇంతలో నా కెదురుగా పరుగెత్తుకొస్తూ ఓ పురుషుడు "ఆగవోయ్-ఆగూ" అని చెయ్యెత్తి అరిచాడు. ఎవరినా అలా కేకలేస్తున్నాడని వెనుదిరిగి చూచాను. పదిగజాల దూరంలోవున్న రిక్షామీది స్త్రీ ఒకామె ఇటుతిరిగిచూచింది. మళ్ళీ అటుతిరిగి రిక్షావాడిని 'పొమ్మన్నట్లు బస్ స్టాండ్ వైపు సైగ చేసింది. ఇంతలో కేకల పురుషుడు ఆ రిక్షాను సమీ పించి "వెనక్కి- తిప్పవోయ్-తిప్పు" అనడం నాకు స్పష్టంగా వినిపించింది. కాని, ఈ మాటల్లో వెనుకటి 'గావు' తనంలేదు; ఏదో 'అవసరం' ధ్వనించింది.

రిక్షావాడు తటపటాయిస్తూ స్త్రీవైపు చూచాడు ఆమె "ఆపవద్దు-పోనియ్, త్వరగా" అని వాడిని గద్దించింది వాడు వాహనాన్ని లాగసాగాడు. అరగజమైనా కదలక

ముందే పురుషుడు దాని చక్రాన్ని పట్టుకుని ఆపాడు. "వద్దు—నామాటవిను–పోవద్దు! ఇంటికెళదాం, రా—" అని స్త్రీ ముఖంలోకి జాలిగా చూచాడు. ఆమె పమిటచెంగును విన్యాసంగా రెండో భుజంమీదికి లాక్కుని – "నీ యిల్లు నా కక్కర్లేదు. నే నాస్రిను. సిగ్గులేకుండా ఏ ముఖంపెట్టుకు అడుగుతున్నావ్—రమ్మని?" అని, "పోనియ్యరా, రిక్షా" అంది, ఆజ్ఞాపనగా.

ఆ పురుషుడు అటూయిటూ బిక్కుబిక్కుమంటూ చూచాడు. అప్పటికే, నా వంటి పదుగురూ ఈ సంఘటనని వింతగా చూడ జేరారు. అతడు ముఖానపట్టిన చెమటతుడుచుకుంటూ—"చూడు, నలుగుర్లోనూ నగుబాటు. న న్నిట్లా అభాసుపాలు చేయడంన్యాయమేనా?" అని ప్రాధేయపూర్వకంగా చేయిజాపాడు. ఆమె ఆ చేతిని విదిల్చికొట్టి, అతనివైపు చూడకుండా "అబ్బ–ఎన్ని తియ్యనిమాటలైనా చెబుతారు. నే చెప్పిన మాట సాగనపుడు, నే నెందుకుండాలీ?" అంది పెదిమెలు బిగబట్టి. విసుగ్గా రిక్షావాడికే చూచింది.

పురుషుడు ఆతురతతో "అలా కాదు. అట్లా అనుకోకు ...ఇక నువ్వుచెప్పినట్లే చేద్దాం. నీ మాట కాదనను...పోదాం పద" అని చెప్పాడు. ఆమె 'వూఁ' అంటూ, పెదిమెలు సడలించింది. అతడు సంతోషంగా "పదవోయ్–రిక్షా–ఇంటికితిప్పు" అన్నాడు.

రిక్షా వెనక్కు తిరిగి గంట గణగణ మోగించుకుంటూ సాగింది. పురుషుడు పరుగువంటి నడకతో అనుసరించాడు—మా వైష్ణు ఓక విజయవిలసితమైన నవ్వు విసరి.



ఇది "కథానిక"కు మరొక ఉదాహరణ. మొదటి పద్ధతికీ, ఈ పద్ధతికీగల తేడాలను జాగ్రతగా పరిశీలించండి. ప్రతివాక్యమూ ఎలాటిమార్పులు చెందినదో ఆ మార్పుల వల్ల కథాశయం ఎలా మార్పు చెందినదో గమనించండి. మొదటికథలోని స్త్రీ-పురుషుల తత్వాలకు, ఈ కథలోని స్త్రీ పురుషుల తత్వాలు పూర్తిగా విరుద్ధాలు. జరిగిన ఒకే సంఘటనను ఇలా విభిన్నంగా చిత్రించవచ్చు. ఈచిత్రణలో ఎక్కడ 'నొక్కిచెప్పడం' జరిగిందో ఎక్కడ గుణగణసూచన చేయబడిందో బాగా గమనించాలి.

ఈ రెండు విధానాలలోనూ ఒకటి మంచీ, ఒకటి చెడూ అని లేదు. రెండూ సమానస్థాయికి చెందినవే.కాని ఉద్దేశాలు విభిన్నాలు. మొదటివిధానంలో పురుషుడు కోపిష్టి, దాష్టికుడు తప్పుచేసినవాడు. స్త్రీ అభిమానంగల సాత్వికురాలు. ఈ కథానికలోని పురుషుడు సాత్వికుడు కాగా స్త్రీ కోపిష్టి, గర్విష్టి, మంకుపట్టుగలదీ అయింది. ఈ విభిన్న చిత్రణలో అనుసరింపబడిన మార్పులు స్వల్పాలు. అందువల్ల రచయిత తాను వాడే పదాలనూ, వాక్యాలనూ ఎంతో తూచి తూచి వాడవలసి వుంటుందని గుర్తించాలి. దీన్ని గుర్తించని రచయిత ఎలాటి పేలవరచనలు చేస్తాడో మీకు ముందుముందు తెలుస్తుంది.

ఈ రెండు పద్ధతుల "కథానిక"లలోనూ గల ప్రతి వాక్యమూ, సూచనా ఏ ఏ ప్రయోజనాలకోసం రచింపబడిందో విమర్శకంగా ఆలోచించండి. రెంటికీగల పోలికలు ఎన్ని వున్నాయో, భేదాలుకూడా అన్ని కనిపించితే నా ప్రయత్నం ఫలించినట్లే. దీనికి మీరు యీ కథానికలను రెండుమూడు సార్లు చదవవలసివుంటుంది. అలాచదివి మీ విమర్శనాశక్తికి పదును పెట్టుకొని ముందుకు చూడండి.

ఈ కథానికకు "మార్పు" అనే మునుపటిపేరు బొత్తిగా అతకదు. దీనికి "విజయయాత్ర" అనే శీర్షిక తగిపోతుంది. 'విజయిని' 'విజయిని?' 'సాధించింది' 'మాటకోసం' 'మగువ మనసు' 'కోపతాపాలు' 'పర్యవసానం' మొదలైనపేర్లు ఏవి తగిలించినా యీ 'కథానిక'కు సరిగా అతకవు. "ఆమెపట్టూ అతనిగుట్టూ" అనే శీర్షిక బాగుంటుందిగాని, కథలో నిగూఢత లేకుండా తేల్చివేస్తుంది. పాఠకులు ఆలోచించే అవసరం అంతగా లేకుండాచేస్తుంది. అందువల్ల "విజయయాత్ర" యీ కథానికకుతగ్గ శీర్షిక.

# 4

ఉదయం ఏడు గంటలకు కాఫీకని వెళ్ళినవాడిని, మిత్రులతో బాతాఖానీవేస్తూ తొమ్మిదిగంటలు కొట్టేవరకూ యింటివద్ద కూరలు తేలేదన్న సంగతి గుర్తురాకుండా కూర్చు న్నాను గృహావసరాలు గుర్తుకొచ్చేసరికి మిత్రులవద్ద శెలవు తీసుకుని యింటికి బయలుదేరాను. గృహిణి ఎంత విసుక్కుం. టుందోననే ఆదుర్దాతో చకచకా నడచిపోతున్నాను.

అలాటి స్థితిలో మళుపు తిరిగేసరికి ఎదురుగా వస్తున్న రిక్షాను ఢీకొన్నంతపనయింది. రిక్షావాడు జరున పక్కకు తిరిగి రక్షించాడు. నేను గాభరాపడి వాడినిచూచేసరికి, వాడు "గంటకొడతాంటే యినపట్టంలా" అన్నాడు కోపంగాను, విసుగ్గా నేను సమాధానం. చెప్పకముందే రిక్షాలోని స్త్రీ "పదరా. రైలు టైమయిందీ" అని వాణ్ణి గద్దించింది. వాడు మళుపు తిరుగసాగాడు.

ఇంతలో నా కెదురుగా పరుగెత్తుకుంటూ ఓ పురుషుడు వస్తూ-"ఆగూ-ఆగవోయ్" అని అరిచాడు. రిక్షావాడు మలుపు తిరగబోతూ ప్రక్కకు, పురుషుని వేపు చూచాడు. ఇంతలో పురుషుడు రిక్షాదగ్గరకుచేరి "తిప్పు-వెనక్కి" అని గర్జించాడు. ఆమె పళ్ళుకొరుకుతూ - "వద్దు - పోనియ్ ముందుకు" అంది. రిక్షావాడు లాగబోయాడు.

పురుషుడు దాన్ని కదలకుండాపట్టుకుని- "వద్దు... రమ్మంటూంటే, నిన్ను కాదూ? ఏమిటీమూర్ఖం? ఇంటికి తిరుగు" అని స్త్రీని ఆజ్ఞాపించాడు. ఆమె పమిటచెంగును పురుగున్నవిదిలించినట్లు దులిపి, మళ్ళీ భుజానసర్దుకుంటూ—"నేనారాను... ఇక నా కక్కడ క్షణం సరిపడదు. ఇక నేను నోరుమూసుకు పడుండలేను. ఇక నన్నాపి లాభంలేదు." అంది.

అతడు "ఇదుగో, నే నెందుకు చెబుతున్నానో విను. లేకపోతే—" అని గర్జించాడు. ఆమె తోకతొక్కిన త్రాచులా చూస్తూ—"ఏం చంపేస్తావా? చంపు. రోజురోజూ నరకయాతనపడేకంటే ఒక్కసారిగా చచ్చిపోతేనే హాయి" అంది. అతడు పళ్ళునూరుతూ అటూఇటూ చూచాడు—దేనికోసమో వెదుకుతున్నట్లు. ఆమె "పోనివ్వరా రిక్షా" అంది ఈలోగా నావలెనే యీ దృశ్యాన్ని చూస్తున్న జనం వికవికా నవ్వింది.

పురుషుడు నడుంవిరిగినట్లు, నీరసంగా"ఇదుగో చూడు-నలుగురూనవ్వుతున్నారు. మనం యిట్లా వీధికెక్కడం ఇద్దరికీ మంచిదికాదు...పద, యింటికిపోయి అన్నీ సర్దుబాటుచేసుకుందాం" అన్నాడు ఆమెతో. ఆమె చెంగుతో శరీరాన్నంతటినీ కప్పుకుంటూ, భయం భయంగా-"తీసుకెళ్ళి మళ్ళీ చెరలుపెడితే—" అంది. అతడు "లేదులేదు. మళ్ళీ నిన్నేమన్నాఅంటే, ఒట్టే" అన్నాడు.

"సరే, ఇట్లా రండి" అని తన ప్రక్కను చోటు చూపింది. అతడు ఛెంగున రిక్షానెక్కి కూర్చుంటూ, పోనియ్‌రా, వెనక్కి—" అన్నాడు.

• రిక్షా సంతోషంగా గంటమోగుతూ తిరిగిపోయింది. ప్రేక్షకుల్లాగా నిలచిన అస్మదాదుల మొఖాలు మతాబాలయినయ్.



ఈ "కథానిక" కు 'తెగనిసంబంధం' 'ఆటూపోటూ' "పొంగుతగ్గి"—వంటి శీర్షికలుపెట్టవచ్చు. 'మార్పు' గాని, 'విజయయాత్ర' గాని అంతగా ఇముడవు.

ఈ విధానంలో ఆ స్త్రీ పురుషుల మన స్తత్వాలు పమాన ఉజ్జీలుగా చిత్రించబడ్డాయి వారిరువురూ కోపమూ, తాపమూ, స్వాతిశయమూ ఉన్నవారే. ఇద్దరూకూడా లోకానికి జడిసి మసలుకునేవారే. ఇద్దరిమధ్యా ఎంత వైమనస్యం ఉన్నప్పటికీ—ఆవేశపుపొంగు చల్లారిన తర్వాత అన్యోన్యంగా సర్దుకుపోయే స్వభావంగలవారు. ఎందులోనూ ఒకరి కొకరు తీసిపోరు.

లోగడ వివరించిన విధానాలకూ, యీ పద్ధతికీగల భేదాలనుకూడా జాగ్రతగా అవగాహన చేసుకోండి.



# 5

ఆరోజున కూరలు కొనుక్కుని తిరిగివస్తూ—గ్రంథాలయంలో పేపరు చదవబోయి దాన్ని వదలలేక కూర్చున్నా తీరా తొమ్మిదిన్నర అయ్యేసరికి ఆఫీసుకు వెళ్ళటానికి సిద్ధమవాలని గుర్తుకొచ్చి, లేచి, ఇంటిముఖంపట్టాను. నేను తెస్తున్న కూరలు గృహిణి వండేదాకాకూడా వ్యవధివుండదు. ఏ పచ్చడి మెతుకులో నోట కుక్కుకుని పోవాలి గదా అని చికాకు మనసుతో నడుస్తున్నానేమో "ఆగూ, ఆగవోయ్" అనే కేక ఎవరిదో చెవుల్లోమోగేవరకూ పరిసరాల గమనికే లేదు.

నా ప్రక్కనుంచి సుడిగాలిలా దూసుకుపోయిన పురుషుడు మళ్ళీ అలాగే కేకపెడుతూ పదిగజాలదూరంలో అటు వేపు వెళ్తున్న రిక్షాదగ్గరకు వెళ్ళి చేత్తోపట్టుకుని ఆపాడు. ప్రయాణమై రిక్షాలో వెళుతున్న స్త్రీ ఏదో మరచివుంటుందనీ, ఈ పురుషుడు దాన్ని అందించడానికి యిలా పరుగెత్తుకొచ్చి వుంటాడనీ అనుకుని నా తోవను పోబోయాను.

ఇంతలో అతడు రిక్షావాడిని "ఏరా, కేకలేస్తూంటే వినపడ్డంలా॰ఆపమంటే ఆపకుండా ఒకటే లగూ తీస్తున్నావే-తిప్పు-వెనక్కి-తిప్పు" అని గద్దించడంవినిపించింది. 'ఆ రిక్షావాడు ఆ పురుషుణ్ణి తప్పుకుని, ఆ స్త్రీని మోసపు ఉద్దేశంతో మారు తోవను లాక్కుపోతున్నాడు గావల్ను—దొంగవెధవ' అనుకుని—వాడికి జరిగేశాస్తిని చూద్దామని నిలచిపోయాను.

కాని, రిక్షాలోనిస్త్రీ "వద్దు,పోనియ్ రా ముందుకు" అని రిక్షావాలాని ఆజ్ఞాపించడం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఇదేదో తెలుసుకోదగిన సంఘటనే ననిపించింది.

పురుషుడు కదలబోతున్న రిక్షావాణ్ణి అవతలకితోస్తూ "పోరా వెధవా" అన్నాడు. స్త్రీ కనుబొమలుచిట్లిస్తూ "ఏమి టీ దౌర్జన్యం! నాదోవను నన్ను పోనీయకుండా ఎందు కీ రభస?" అంది. పురుషుడు "చెబుతున్నకొద్దీ నీ ఆగడం మరీ ఎక్కువయిందే! నడిబజారులో నన్ను ఎదిరిస్తావా? ఏం జూసు కునే నీ పొగరూ?" అన్నాడు పళ్ళుకొరుకుతూ.

స్త్రీ—"ఏం, మీరు పొమ్మని గెంటేసినా మీ చూరు పట్టుకునే వేళ్ళాడాలా? నా ఖర్మం కాలిపోలా. మా కన్నారింకా బతికేవున్నారు. మీకు లేకపోయినా వాళ్ళకి నామీద ప్రేమ వుంది. నా పొట్టకింత కూడు వెయ్యలేకపోరు" అన్నది పమిట చెంగుతో శరీరాన్ని బిగించుకుంటూ. పురుషుడు—"ఏడ్చా వులే—వెధవ బింకమూ నువ్వూను. ఏదో కోపంలో పొమ్మంటే, అదే పట్టుకుని యిలా ప్రయాణమౌతావా... పద యింటికి" అని, ఆమెజవాబుకోసం ఎదురుచూడకుండానే రిక్షావాడ్ని "తిప్పుకు పదరా" అని పురమాయించాడు. ఆమె "అమ్మో—నేనారాను. చీటికీ మాటికీ అదిరించి బెదిరించి చెయిజేసుకునే మీతో ఇక కాపురం చెయ్యలేను—నన్ను మా రిక బతకనివ్వరు. నేనారాను" అంటూ, వణికిపోతూ, చుట్టూ జేరిన నాబోటివాళ్ళవేపు బెదరిన లేడిలా చూచింది.

ఆ పురుషుడు—"లేమ లేవే—నువ్వు లేకుండా నేను మాత్రం వుండగల్నా? ఏదో మొగాణ్ణి చిర్రుబుర్రుమంటే—యింత యిది జేస్తే ఎట్లా చెప్పు. ఇకనుంచీ నిన్నేమీ అననుగాని—పోదాం పద" అని సముదాయించాడు. ఆమె "సరే పదండి. ఈసారి యిట్లాచేస్తేమాత్రం ఒక్కక్షణం వుండలేను, అంతే"అన్నది. "సరేలెమ్మన్నానుగా"అంటూ అతడు వెనక్కు తిరిగాడు, రిక్షా వెంబడించింది.

* * * *

ఈ కథానికకు "అనుకంప", "భయం—నయం" అనే పేర్లు తగిపోతాయి. 4వ అధ్యాయానికి నిర్ణయించుకున్న పేర్లుకూడా పెట్టుకోవచ్చు.

ఈ విధానంలో జరిగిన మార్పులు మరీ ఎక్కువగా వుండడం గమనించదగ్గది. కథావస్తువు ఒకటేఅయినా, ఆదర్శం లేక ఉద్దేశం ప్రతిఅధ్యాయంలోనూ ఎలా మారుతున్నదో ఇప్పుడు మీరు సులభంగా గుర్తించగలుగుతారు. ఈ కథానిక లోని పాత్రల మనస్తత్వాలు మరోరకానివిగదా. పురుషుడు కోపిష్ఠి, దాష్టికుడు, అహంభావుకుడే గాక—భార్యనుకొట్టే రాక్షసుడనికూడా తేలుతూంది. కాని యింతటి వికృత మనస్తత్వంవెనుకా, అతని మనసు అంతరాంతరంలో ఆమె మీద విడువలేని ప్రేమకూడా వున్నట్లు తెలుస్తూంది.

ఆ స్త్రీ అనేక బాధలుపడి, భర్త గెంటివేయడంచేత మనసును రాయి చేసుకుని నిర్జీవంగా పుట్టింటికి పోతున్న అభిమానవతిగా చిత్రించబడింది. ఎన్ని బాధలుపెట్టినా భర్త ప్రేమను తృణీకరించలేదని హిందూపత్నిగా ఆమె మన సానుభూతిని పొందుతూంది.

ఈ ముఖ్యాంశాలలో విభిన్నపద్ధతులేగాక — మొదటి పేరాలో కథకునికి యీ సంఘటన దృష్టికివచ్చిన విధానం కూడా ప్రతి అధ్యాయంలోనూ ఎలా మారుతున్నదో మీరు గుర్తించేవుంటారు. ఈ ప్రారంభంపలెనే ముగింపుకూడా బహువిధాలుగా వుండడాన్ని గమనించండి.



# 6

(గత అధ్యాయంలోని కథానికనే 6 పేరాలవరకూ మళ్ళీ చదవండి. చివరి పేరాకుబదులుగా ఈ క్రింది పేరాలు చేర్చుదాం.)

ఆ పురుషుడు—"ఇదుగో- ఏదైనా తెగేదాకా లాగ్గూడదు తెలుసా. నోరుమూసుకుని ఇంటికి పద. లేకపోతే నా చేతులోచావుమూడిందే—అంతే" అంటూ పైపంచె తీసి నడుముకుబిగించుకున్నాడు. నేనా జరగబోయే రాక్షసాన్ని ఊహించి సహించలేక, చరచరా వెళ్ళి "ఏయ్, ఏమిటయ్యా ఈదౌర్జన్యం? కట్టుకొన్న భార్య నెవరైనా యింతగా గొడ్డులాగా చూస్తారా? మగవాడివిగదాఅని నీ పశుబలమంతా ఈ అబలపైన చూపిస్తావా? చాలుచాల్లేవయ్యా. అందుకనే ఆమె నీతో కాపరం చెయ్యలేక వెళ్ళిపోతానంటోంది. పోనియ్యవయ్యా—వదులు' అని తీవ్రంగా హెచ్చరించాను. జనం దగ్గరకువచ్చి అతన్ని తలోకమాటా అంటూ ఆమెను వెళ్ళనీమన్నారు.

అతడు వికటంగానవ్వి "అయితే—ఇది కట్టుకున్న నాతో కాపరంజెయ్యక నీతో చెయ్యడానికటయ్యా పోతున్నదీ? నా పెళ్ళాన్ని నా యిష్టంవచ్చినట్లు చేసుకుంటాను. మధ్య మీ రెవ్వరయ్యా వదిలెయ్యమనేందుకూ? మీ పెళ్ళాల్ని వదిలెయ్యమంటే మీరు వదిలేస్తారాఏంటి?" అని తుప్పుక్కున వుమ్మేశాడు. నా నోరు నొక్కుకుపోయింది. ఇంకా మాట్లాడితే చెయి జేసుకునేటట్టు కనపడ్డాడు.

జనంలో ఒకరు—" నీపెళ్ళామయినందుకు నువ్వు చంపుతానంటే 'లా' ఒప్పుకోదు. ఆవిడఇష్టం లేకుండా నువ్వు

లాక్కు-వెళ్ళావా—పోలీసుల కిప్పుడే రిపోర్టిచ్చి, క్రూయెలిటీ (రాక్షసం) నేరంక్రింద అరెస్టుచేయిస్తాం—జాగ్రత్త" అని హెచ్చరించారు.

ఆ పురుషుడు పళ్ళు పటపటకొరుకుతూ, పెదాలుకరచుకుని, అణచుకుంటున్న క్రోధస్వరంలో—"ఏమే, మెదలకుండా ఇంటికొస్తావా—లేకపోతే నన్ను జైలుకిపంపాలనుందా?" అని అడిగాడు. ఆమె హఠాత్తుగా దెబ్బతిన్న లేడిలా—"జైలుకా! మీరే! వద్దు వద్దు...వస్తా పదండి" అంది.

రిక్షాతిరిగింది. మా ముఖాలు ముడుచుకున్నాయ్.

* * * *

ఈవిధంగా కథాసంవిధానం మారేసరికి—ఉద్దేశాలు కూడా మారుతయ్. ఇందులో పురుషుడు ఎంతదాష్టికుడయినా అతడు జైలుకెళ్ళడానికిగాని, నిందపడడానికిగాని ఒప్పుకోని స్త్రీలుంటారని తెలుస్తూంది. పైగా అలాంటి స్త్రీలకు సానుభూతి చూపేవాళ్లు నిర్విణ్ణులయ్యేట్లు—తనమేలుకంటే, భర్త పేరుప్రతిష్ఠలకే దోహదమిచ్చేటట్లు ప్రవర్తిస్తారనీ తేలుతూంది.

ఇటువంటిమన స్తత్వాలనిరూపణ అభ్యుదయాశయాలకు సరిపడకపోయినా—వాస్తవాన్ని చిత్రించడమే అవుతున్న దిగ్గనుక దీన్ని మంచికథానిక అనకుండావుండ లేము.

ఈ కథానికకు "దాసోహం" "అంతరం" అనే శీర్షికలు బాగుంటాయి. 'ఆమె ఎన్నిక' అనే శీర్షిక ఇంకా సూటిగా వుంటుంది. వెనుకటి అధ్యాయాల్లో పేర్కొన్న పేర్లు ఎలా పేలవంగా వుంటాయో చూడండి.

# 7

(ఈసారి గత అధ్యాయపు కథానికలోని చివరి రెండు పేరాగ్రా వదలి వేసి, ఈ క్రిందివిధంగా కలుపుకోండి.)

ఆ పెద్దమనిషి అలా బెదరించేసరికి, యీ పురుషుడు పళ్లు పటపటకొరుకుతూ—"ఆఁ! నన్నే అరెస్టుచేయిస్తావ్రా ? రా, చూద్దాం" అంటూ, చొక్కా-చేతులు పైకిమడిచాడు. పెద్దమనిషి—"ఏం, కొడతావా ? కొట్టు చూద్దాం" అంటూ ముందుకు వచ్చాడు.

పురుషుడు "నువ్వుడు రా, చెప్తాను" అంటూ స్త్రీ చేతిని పట్టుకుని బడబడా లాక్కు-పోబోయాడు. పెద్దమనిషి ఆమె రెండవచేతిని పట్టుకుని—"ఆగవమ్మా—ఏం చేస్తాడో చూస్తాను" అన్నాడు. అతని ధైర్యానికి మా అందరికీ సంతోషం కలిగింది.

కాని;

ఆ స్త్రీ గొంగళీపురుగును విదిలించినట్టు ఆ పెద్దమనిషి చేతిని విసరికొట్టి—"ఛీ! నాచెయ్యి పట్టుకుంటా వేమిటయ్యా, ఛా" అని భర్తవెంట నడచివెళ్ళింది. రిక్షావాలా వెంటబడి డబ్బు లడిగాడు. భర్త జేబులోంచి రూపాయినోటు తీసి వాడి కిచ్చాడు. ఆ స్త్రీ పురుషులు చెట్టాపట్టాలు పట్టుకుని వెళు తూంటే నేనూ, అడ్డొచ్చిన పెద్దమనిషీ, తతిమ్మావారూ కూడా తెల్లమొఖాలువేశాం.

   

ఈ మార్పిడివల్లకూడా ఆ స్త్రీ—ఎన్ని బాధలు పెట్టి నప్పటికీ భర్తతో కాపురంచేయడానికే తలొగ్గేవ్యక్తి, తన తరఫునే అయినా ఇతరులు జోక్యం కలిగించుకొని, భర్తను మొదలించడానికి ఇష్టపడనిదీ అని తేలుతూంది.

ఈ కథానికకు కూడా క్రిందటి అధ్యాయం చివర సూచించిన పేరులే పెట్టవచ్చు.

ఈ భార్యాభర్తలు సేడిస్టిక్ టెంపరమెంట్ (శారీరక బాధలద్వారా ప్రేమను అనుభవించే మనస్తత్వం)గలవారుగా చిత్రించాలంటే, ఆ పురుషుడామెను కొన్ని దెబ్బలు కొట్టి నట్లూ; ఆమె అమాంతం అతన్ని కౌగలించుకుని 'ఇంటికి పోదా'మన్నట్లూ యీ కథాంతాన్ని మార్చుతారు— సైకాలజిస్ట్ కథకులు.

ఈ మాదిరిగా చిన్నచిన్ని మార్పులవల్ల యిదే కథను అనేకరకాలుగా వ్రాయ వీలుంది. మీరు ఊహించి మరికొన్ని రకాలుగా వ్రాసుకుని చూడండి. ముందు అధ్యాయాలలో పెద్దపెద్ద మార్పులతో విభిన్నమైన ఉద్దేశాలతో యిదే కథను ఎలా వ్రాయవచ్చునో చూద్దాం.



# 8

ఎందుకనో - ఆ దృశ్యం చూడగానే నాకు సీతా ద్రౌపదీ గుర్తుకొచ్చారు. అణుయుగంలోకూడా పురాణ యుగపు సంఘటనలు జరిగే అవకాశం వున్నదా, లేదా అని నేనాలోచించనేలేదు

కాఫీకని అప్పుడే బయలుదేరి రోడ్డుమీదికొచ్చాను. అతివేగంగా పడమటివేపు పరుగెత్తుతున్న నరవాహనంలో వెనక్కు-చూస్తున్న స్త్రీ ఒకామె కనిపించింది. ఆమెముఖంలో భీతీ, కళ్ళలో నీరూ, నుదురుమీద రేగినజుత్తు చూచేసరికి రావణునివాహనంపైనున్న సీత గుర్తుకొచ్చింది. ఇంతలో తూర్పువైపునుంచి ఒకపురుషుడు హుటాహుటాటి పరుగెత్తు కొస్తూ-"ఆగూ-ఆగవోయ్" అని కేకలేయడం చూచాను. అతడు దగ్గరకొస్తూ"ఆపవోయ్ రిక్షా"అని అరిచాడు. నాభావన దృఢమైనందుకు నాకే ఆశ్చర్యంవేసింది. ఆ రిక్షావాడు రావణుడూ, ఆమె సీతా, పురుషుడు రక్షింపవచ్చిన రాముడూ నను కున్నాను.

పురుషుడు రిక్షాచక్రాన్ని గట్టిగాపట్టుకుని "తిప్పవోయ్-వెనక్కి-" అన్నాడు. ఎంత సహనం! నాలుగుతన్నక-ఆ రావణుణ్ణి మర్యాదగా సంబోధిస్తున్నాడే యితడూ!!.

ఇంతలో స్త్రీ-"వద్దు. పోనియ్, ముందుకి" అంది. నా ఆలోచనలు అమాంతంగా పేకమేడల్లా కూలిపోయాయి.

పురుషుడామెతో "వద్దువద్దు. రమ్మంటూంటే—" అన్నాడు ఆమెతో, జాలిమొఖంతో. ఆమె పమిట చెంగును దిటవుగా కప్పుకుంటూ—"నేన్రాను. నా కా కాపరం అఖ్ఖర్లేదు" అంది, దృఢంగా—పాపం! అతనితో ఎన్ని యాతనలోపడి, విసుగెత్తిన గృహిణి!!

అతను మళ్ళీ..."ఇదుగో, నా మాట విను. తిరిగి పోదాం పద. ఇదంతా మరచిపోయి, హాయిగావుందాం" అని మృదువుగా చెప్పాడు. ఆశ్చర్యం! అతడు చాలా సౌమ్యుడుగా వున్నాడే!

ఆమె పెదిమలు తడుపుకుంటూ—"ఎందుకూ—మెత్తమెత్తని కభుర్లుచెప్పి యింటికి వెళ్ళాక మళ్ళీ మామూలు నరకంలో తొయ్యడానికా?" అంది. అతడు మేకవన్నె పులి గావల్ను.

అతడు చొక్కా చేతులు మడుస్తూ "ఇదుగో, మంచిగా చెబితే నువ్వు వినవు. వెనక్కి తిరిగివస్తావా, లేదా?" అని అరిచాడు. నిజం నిజం. అతడు మేకవన్నెపులి.

ఆమె "అమ్మో!...చంపేస్తావు...నేనొను" అని అరిచింది. దెబ్బతిన్న లేడిలా వణికింది. రోడ్డుమీద పోయ్యేన జనం ఆ రాక్షసుణ్ణి ఆపడానికైనా యత్నించరే?

అతడు దుశ్శాసనునిలా ఆమెచేతిని పట్టుకుని రిక్షాలో నుంచి క్రిందికి లాగాడు "ఊఁ—పద" అని బరబరా లాక్కుపోతున్నాడు. ఆనాడు నిండుసభలో ద్రౌపదిచీరలాలిచిందాని

కంటే—నడిబజారులో ఈ స్త్రీని యిలా లాక్కుపోవడం ఏం తక్కువ ?

నే నీ దౌష్ట్యాన్ని చూస్తూ వూరుకోగలనా ? ఒక్క అంగలో వాళ్ళదగ్గరకు వెళ్ళి "ఏమయ్యోయ్, నీ దుర్మార్గానికి ఎదురులేదనా ఆ హాజం ? ఆ అబల నెందుకలా బలవంతం చేస్తావు ? వదులు." అని గర్జించాను.

అతడు కళ్ళురుముతూ నన్నూ, చుట్టూవున్న వాళ్ళనీ చూచాడు. ఆమెతో "చూచావా, ఎంత అభాసుచేశావో. నలుగురిలోను నువ్వూ నగుబాటై నన్నూ నవ్వులపాలుచేశావు. ఇది మంచిపనేనా ?" సోడాపొంగు చల్లబడ్డట్లు మాట్లాడాడు. మేకవన్నెపులి నక్కజిత్తులు నేర్చింది !

ఆమె—"మరి, నామాట చెల్లంది నే నా యింట్లో ఎందుకూ ?" అంటూ బుంగమూతిపెట్టింది. మరోసారి నా మనస్సు గతుక్కుమంది. అతడు నవ్వుతూ "లేదులే, ఇక నుంచీ నీ మాటప్రకారమే కానిద్దాం—పద" అన్నాడు

నేను—"నమ్మకమ్మాయ్. తీసుకెళ్ళి కొడతాడేమో" నని ఆపాను. అతడు "చూచావా—ఊళ్లో వాళ్ళంతా నను గురించి చెప్పుకునేట్టు చేశావు. నే నేం బాధపెట్టాననీ, ఈ శిక్ష ?" అని అడిగాడు.

ఆమె చుట్టూచూచింది. "అయ్యో, నా మతి మండా! కాస్తదానికి ఎంత పొరపాటుచేశానూ ! పదండి పోదాం" అంది. అతడు రిక్షానుపిలచి, ఆమెను చేయిపట్టుకు ఎక్కించి,

తానూ ఎక్కి పక్కను కూర్చున్నారు. రిక్షా జయ జయ ధ్వానాలతో వెళ్ళిపోయింది.

డేమిట్! కథ అడ్డంతిరిగింది.

♦ ♦ ♦ ♦

ఇది వెనుకటి అధ్యాయాలకు పూర్తిగా విభిన్నమైన పద్ధతి కథానిక. ఇందలి పాత్రలలో పురుషుడు మంచివాడు పురుషసహజమైనకోపం అవసరాన్నిబట్టి ఏర్పడినా స్వవిచక్షణతో తగ్గించుకునే ఉత్తముడు. ఆమె అతి చిన్నదానికి కూడా చిరాకుపడి, కుటుంబరీతిలో ఇముడలేని స్త్రీ. కాని, ప్రేమ, గౌరవం, లోకజ్ఞానం తక్కువకాదు. ఈ రెండింటికంటే ముఖ్యమైన మూడో పాత్ర ఒకటి వుంది. అది కథకునిది.

ఈ కథకుడు ప్రతిదానినీ ఉత్ప్రేక్షలతో ఊహించే వ్యక్తి. అందువల్ల ప్రతి సందర్భంలోనూ అతడు పాత్రలను మరొకరిగుణంతో పోల్చుతాడు. ప్రతీసారీ తద్వ్యతిరేక గుణాలు బయటపడుతూంటాయి. ఎప్పటికప్పుడు కథకుని అంచనాలు తారుమారవుతూంటాయి. ఇందువల్ల కథకుడు వెర్రివాడని పాఠకులూహించడానికి వీల్లేదు.

ఈ పద్ధతి రచన పాఠకుల నెంతో ఆకర్షిస్తుంది. ఈ కథానికలోని విషయాదర్శం ఉత్తమంగా చిత్రించబడి ప్రయోజనాన్ని సాధించడమే గాక—పాఠకులలో మరొక ఆలోచననుకూడా రేకెత్తించే - శిల్పంయిది. ఈ శిల్పంవల్ల—దేని

కైనా మనం తొందరపడి అంచనాలు వేసుకోరాదనీ, పూర్తిగా సమస్యను పరిశీలించిన తరువాతనే ఒక నిర్ణయానికి రా ప్రయత్నించాలనీ పాఠకులకు అవగతమవుతుంది. ఈ విధంగా ఈ శిల్పంవల్ల ఈ కథానికవిలువ యింకా పెరుగుతూంది.

దీనిని వ్యంగ్యశిల్పము అనవచ్చును. ఇట్టి రచనలకు శీర్షికలుకూడా వ్యంగ్యధోరణిలోనే వుండడం బాగుంటుంది. కథాంతంలో ఉపయోగింపబడినవాక్యం "డేమిట్, కథ అడ్డం తిరిగింది" అనేపేరు ఫరవాలేదు. "అంతుతెలియని అంచనాలు", "అలాగటయ్యా ?" "ఎంతపనీ !" మొదలైనవాటిని వ్రాసి—ఏది సరిగా అతుకుతుందో చూడండి. "అలాగటయ్యా ?" ఎలా వుంది ?

# 9

అవునట. అందుకేనటా, నాకటా, ఆమెను చూస్తేనటా, జాలట !

మా యింటి కెదురుగా వుంటున్న కుటుంబంలోని ఆ కోడల్ని చూస్తేనే అలా అనిపిస్తుంది. ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూనే కనపడుతుంది. ఆ విపరీతపు పనిభారమూ, ఆ కుటుంబజీవితపు భారమూ ఆమె ముఖంలో ఎప్పుడూ కని పిస్తూనే వుంటుంది. మా ఆవిడకూడా ఈ విషయంలో మాత్రం నా అభిప్రాయంతో ఏకీభవించింది.

అవునట. అందుకేనటా, నాకటా, ఆమెను చూస్తేనటా, జాలట !

వాళ్లు ఆ యింట్లోకి కాపురంవచ్చి నెలపైనే అయింది. వచ్చిన మరురాత్రినుంచీ కూడా ఆమెనుచూస్తే అలానే అని పించుతూంది. అత్తగారి అరుపులూ, భర్తగారి గద్దింపులూ— నోట్లో గుడ్డకుక్కుకున్నా వినిపిస్తున్న ఆమె ఏడుపూ—అందుకే నటా, నాకటా, ఆమెను చూస్తేనటా, జాలట !

ఆ రాత్రి మొదటిఆట సినిమాకు వెళ్ళివచ్చి, భోంచేసి మా వరండాలో పచారుచేస్తున్నాను. ఆ యింటాతడుకూడా అప్పుడే వచ్చినట్లున్నాడు. తల్లి ఏదో చాడీలు గావల్ను చెబు తూంది అతడు భార్యనుగావల్ను గద్దించుతున్నాడు. ఆ సహన శీల గావల్ను బెక్కి-బెక్కి ఏడుస్తూంది. అత్తా, భర్తా రాచి రంపానపెడుతున్నారు గావల్ను - అందుకేనటా, నాకటా, ఆమెనుచూస్తేనటా, జాలట !

మర్నాటివుదయం ఫలహారం, కాఫీ ముగించి బజారుకు బయలుదేరాను. గుమ్మందిగేసరికి ఆమె యింట్లోంచి చరచరా బైటికివచ్చి, పోతున్న రిక్షానుపిలిచి ఎక్కింది. రిక్షా ముందుకు సాగింది. ఆమె ముఖంలోని దిగులును చూస్తే నేచాలు-కడుపు తరుక్కుపోయింది. అందుకేనటా, నా కటా, జాలట!

నాపనిమీద నేనూ ఆ రిక్షావెళ్ళినవేపే వెళుతున్నాను. నాలుగిళ్లు దాటేసరికి, నావెనుకనుంచి "ఆగూ—ఆగూ" అని కేకలువేస్తూ, పరుగున దూసుకుపోయాడు—ఆమెభర్త. ఆ యింట్లో బాధలుపడలేక ఆమె వెళ్ళిపోతూంది గావల్ను. అందుకేనటా, నాకటా, జాలటా!

అతడు "ఆగూ—ఆగవోయ్" అనే కేకలతో రిక్షాను సమీపించి 'తిప్పు వెనక్కి' అని ఆజ్ఞాపించాడు. రిక్షావాడు బిక్కమొగంవేసి ఆమెవైపుచూచాడు. ఆమె "వద్దు-పోనియ్ ముందుకి" అంది. అతడు "ఏయ్—రమ్మంటూంటే, ని క్కాదూ?" అనిగద్దించాడు. అందుకేనటా, నాకటా, జాలటా!

ఇంతలో నాబోటివాళ్లు పదిమందీ జేరి ఏంజరుగుతుందా అని చూస్తున్నారు. ఆమె అందరినీ పరికించి సిగ్గుతోగావల్ను పమిట తలనిండా కప్పుకుంటూ 'నేనాను. నా మాటే మీకు పనికిరానపుడు—నే నెందుకు ఆ కొంపలో?" అంది-శోకాన్ని అణచుకున్న కోపంతో. అందుకేనట, నాకటా, ఆమెనుచూస్తే నటా, జాలటా!

అతడు-"ఇదుగో, ఎంతచెప్పినా నీపట్టు నీదేగాని మంచీ చెడూ లేదా? ముసలావిడస్వభావం నీకు తెలియందా? ఆమె

గుణం అంతేలెమ్మని సరిపెట్టుకుపోవాలిగాని, ఇలా బజారు కెక్కడమా? ఆమెకూడా, ఇంటిపనులన్నీ తనేచేస్తున్నదిగదా. వంటబాగుండకపోతే, నిన్నూ కూరలు చేయమని అడిగినందుకా రాత్రినుంచీ రాద్ధాంతం?" అని అడిగాడు. ఆమె "అయినా చీటికీ మాటికీ గొణుగుతూంటే, మీరూ ఆమె పక్షమేమాట్లాడితే—నాకెందుకూ?"అంది నిరుత్సాహమాటంగా. అతడు—"అబ్బబ్బ! ఏమి టీ చిన్నతనపుమాటలు! ఆమె ఏం గొణిగినా మనమేలుకోసమేగా. కాస్సేపు తలొంచితే సరి పోయె. ఆమెతరఫున మాట్లాడినా, నీ యిష్టమొచ్చినట్లె జరుపుతున్నాగా అన్నీనూ...పద యిక. చూడు; నలుగురూ ఎలా నవ్వుతున్నారో" అని జాలిగా అడిగాడు.

ఆమె— "అట్లాగయితే—సాయంకాలం బంగారం కొట్టుకు వెళదామంటే వస్తా" నన్నది. అతడు "అలాగే వెళదాం. నెక్లెస్ మంచిదే కొనుక్కో" అనిచెప్పి రిక్షాను తిప్ప మన్నాడు. ఆమె తలముసుగు తీసి విలాసంగా భుజంమీదికి వదిలి, నవ్వింది. రిక్షా గణగణమోగుతూ వెనుదిరిగింది. అత డనుసరించాడు.

అవునట. అందుకేనటూ, ఆమెనుచూస్తేనటూ, నాకటూ—

* * *

ఇది మరొక వ్యంగ్య పద్ధతి కథానిక. కథకుడు ఇందలి నాయకినిగురించి జాలిపడటంతో పాత్రలను పరిచయం చేసు కున్నాడు. ఆ జాలిపడడం చివరికి పూర్తిగా అసమంజసం అనేది కథకునికి తెలుసు. అందుకనే ప్రారంభంలోనే తనను తాను వెక్కిరించుకున్నట్లు జాలిని ప్రస్తావించాడు. ఆ ధోరణి చివరి

వరకూ వదలలేదు. అందువల్లనే చివరికిగాని ఆ మాటలన్నిసార్లు వాడడానికి గల అవుసరం పాఠకులకు స్ఫురించదు. మధ్యమధ్య 'గావల్ను' అనే పదంవచ్చినవాక్యాలను మరొకసారి చదవండి.

ఒక వ్యక్తిమీద మనకు కలిగిన అభిప్రాయాలు ఒక్కొక సారి వాస్తవాలనే అనుకుంటాం. ఆ దృష్టి మనసులో పాదుకు పోయిన తర్వాత ఏదిజరిగినా ఆ వ్యక్తిపై మనకేర్పడిన అభి ప్రాయానికి అనుగుణంగానే అన్వయించుకుంటాం గాని, వాస్త వాన్ని గ్రహించలేము. ఇందులో కథకుడు ఆమెమీద జ్ఞాలి భావాన్ని దృఢంచేసుకున్నాడు. ఆమెవిషయంలో జరిగిన ప్రతి సంఘటనలోనూ ఆమె అనవసరంగా ఇతరులచేత బాధించ బడుతున్నదనే అన్వయమే చెప్పుకున్నాడు. ఈ విషయాన్ని స్ఫురింపజేసేందుకు 'గావల్ను'లు వాడాడు.

ఇలా ప్రథమంలో ఏర్పడిన భావాలు కథాంతానికిక్రమ క్రమంగా తారుమారుచేయడంవల్ల కథలో ఒకరకమైనసస్పెన్సు ఏర్పడి, పాఠకులనుతనతోయీడ్చుకుపోయేఆకర్షణకలుగుతుంది.

ఈ కథానికలో ప్రథమ పరిచయంలో ఏర్పడిన అభి ప్రాయాలు వాస్తవానికి వ్యతిరేకంగా వుంటాయి అనేదాన్ని నిరూపించబడింది. ఈ నిరూపణకు ప్రథమంనుంచీ వాడిన "......ట" అంత్యపదాలు నొక్కిచెప్పేందుకు ఉపయోగించ బడ్డాయ్.

ఈ వ్యంగ్యశిల్పాన్ని శ్రీ టి. గోపీచంద్‌గారు చాలా విజయవంతంగా వాడారు. ఇట్టి రచనకు వ్యంగ్య శీర్షికలే తగి వుంటాయి. "అలాగటయ్యా!" అనేపేరు అతికిపోతుంది.

  

7)

# 10

శాంత ఏమైనాసరే యిక ఆయింట్లో ఉండరాదని నిశ్చయించుకుంది. ఇంతకాలంగా తను అత్త ఆరళ్ళూ, భర్త గద్దింపులూ శాంతంగా సహించిందిగాని, ఇక యీ అశాంతి జీవితము కొనసాగించలేననుకున్నది. రాత్రి అనవసరంగా అంత రాద్ధాంతం జరిగాక - కుక్కిమంచంమీద పడుకొని భళ్లున తెల్లవారేవరకూ ఆలోచించింది. ఇకనేమైనాసరే ఆ యింట్లో వుండడం నరకసమమేనని అనుకుంది. అందుకనే నిశ్చయించుకుంది - వెళ్ళిపోవాలని.

ఆలోచనల అలసటవల్ల, నిద్రలేచేసరికి పొద్దెక్కింది. పందిరిమంచంమీద భర్త లేడు. కాలకృత్యాలకు దొడ్లోకి వెళ్ళాడు గావల్ను. ఆయనకి మొఖంపుల్లదగ్గర్నుంచీ అన్నీ తను అందించాలి. దేనికి కాస్త ఆలస్యమైనా కస్సుమంటాడు. అదుగో - పెరట్లో ఏదో సందడవుతూనే వుంది. అత్తగారు గావల్ను వంటింట్లో పాత్రలకి బుద్ధిచెబుతూంది. అంతే అయివుండాలి. ఆయనకి ముఖంకడగ్గానే కాఫీ అందివ్వాలి. తను లేవలేదని అత్తగారే కాఫీ చేస్తూండాలి. ఒక్కనాడు ఒక చిన్నపని చెయ్యాలిసొచ్చేసరికి ఆమె కెంత విసుగూ, ఎంత ఆర్భాటం, ఎంత సాధింపు!! మున్నాటఅరవైనాలుగు రోజులూ, రోజుకు 18 గంటలన్నా పనులు చేస్తున్న తనకో చీవాట్లు, గద్దింపులు!! గత పదేళ్ళ జీవితసారమూ అదే.

పెరట్లోని సందడీ, వంటింట్లోని సాధింపులూ చెవుల బడేసరికి త్వరగా వెళ్ళి తన పనులు చేసుకుందామనుకున్నది. కాని, ఇక నేమైనాసరే ఆ యింట్లో వుండరాదని నిశ్చయించుకున్న సంగతి గుర్తుకొచ్చింది. మెల్లగా లేచి చుట్టూచూసింది. గదినిండా పదేళ్ళనుంచీ ఆత్మీయమైన దృశ్యాలు, అనుభవాలు.

పెల్లుబుకుతున్న కన్నీటిని ఆపుకుంటూ, ఔడుగరచుకొని బైటపడింది. ఓ రిక్షాను పిలిచి, ఎక్కి, బస్ట్సాండువైపు పోనిమ్మంది. రిక్షా సాగింది. పదిగజాలు పోయేసరికి ఆమె కడసారిగా యింటినీ వీధినీ చూద్దామనుకుంది. వెనక్కు తిరిగి చూచింది. గుమ్మంలోనుంచి భర్త చరచరా బైటకురావడం చూచి, ముఖంతిప్పుకుంది. గుండెలు ఇరుకునపడ్డట్లయింది.

మరో పాతికగజాలు వెళ్ళేసరికి "ఆగూ—ఆగవోయ్" అనే కేకలు వినిపించాయ్. తనభర్త శంకరయ్యే పిలుస్తున్నది. కాని, తన నిశ్చయాన్ని సడలించదలచలేదు. కళ్ళను కప్పిన నీరు చెంగుతో తుడుచుకుని 'త్వ ర గా పోనియ్' అంది రిక్షావాడితో.

ఇంతలో శంకరం రిక్షా దగ్గరకు పరుగెత్తుకొచ్చి "తిప్పు—వెనక్కి" అని రిక్షావాణ్ని ఆజ్ఞాపించాడు. శాంత 'వద్దు—పోనియ్ ముందుకు' అంది. శంకరం రిక్షావాణ్ణి 'ఆగు' అని, ఆమెను "రమ్మంటూంటే—" అని తీక్షణంగా చూచాడు. ఆమె అతన్ని చూడలేక మొఖం పెడగాపెట్టి, పమిటచెంగుతో

శరీరాన్ని కప్పుకుని—"నేనురాను...ఇక నా కా యింట్లో క్షణం సరిపడదు. ఆ ఆరళ్ళూ, సాధింపులూ, గద్దింపులూ నే నిక పడలేను" అంది - దిటవుగా.

శంకరం "అదుగో - అలా అంటే ఎట్లా! నే నెందుకు చెబుతున్నానో గ్రహించు. రా పోదాం—" అన్నాడు. ఆమె "ఊహుఁ" అంది. ఇంతలో చుట్టూపోగైన జనాన్ని శంకరం గమనించాడు. నీళ్లునములుతూ "ఇదుగో-చూడు, నలుగురూ నవ్వుతున్నారు. సంసారమన్నాక అనేకం వుంటాయ్. ఏదో సర్దుకుపోవాలిగాని, తెగతెంపులా...ఇది మనిద్దరికీ మంచిది కాదు" అంటున్నాడు.

శాంతమ్మ చుట్టూ చూచింది. జనంలో కొందరు నవ్వుతున్నారు. ఆమె చెంగునుతలమీదికి లాక్కుని, ముఖం క్రిందికి దించుకుని-"సరే-పదండి" అంటూ తనపక్కనుచోటుచేసి, చూపింది. శంకరంసంతోషంగా చెంగున రిక్షాఎక్కి "తిప్పరా" అన్నాడు.

  

ఈ కథానిక లోగడ అధ్యాయాలలో కేంద్రీకరింపబడిన రోడ్డుమీది సంఘటననే గాక- అంతకుముందు ఆ స్త్రీ యింటి జీవితాన్ని కూడా కొంత పరిచయంచేస్తున్నది. ముఖ్యపాత్రలకు పేర్లు ఉటంకించబడ్డాయి. ఈ మార్పులవల్ల కథానికలో నూతనంగావచ్చిన పరిణామాలను చూడండి.

ఆమె సాంసారికజీవితాన్ని సూచనప్రాయంగా చిత్రించడం జరిగింది. ఆమెపేరు ఆమె స్వభావానికి చిహ్నం. ఆమె మన స్తత్వం తేలికగానే మీరు గ్రహించివుంటారు. ఎన్ని కష్టాలు కలిగినా, ఏ ఆవేశాలకు లోబడి ఎలాటి నిశ్చయాలకు వచ్చినా– సంఘమర్యాదలకు, కుటుంబగౌరవానికీ తలొగ్గే భారతనారి ఆమె. శంకరం పురాతన భావాలకు వశంవదుడు. తల్లిని గద్దించలేడు; పురుషాధిక్యతతో భార్యనే గద్దించగలడు. కాని, ఆమె శాంతస్వభావం అతనికి తెలుసు. ఈసంగతి ఆతడు చివరికి అన్నటువంటి "సంసారమన్నాక అనేక ముంటాయి. ఏదో సర్దుకుపోవాలి గాని–" ఈ వాక్యాలవల్ల తెలుస్తూంది. ఈ మాటలతర్వాత "ఇంతకాలమూ నీవు సర్దుకుపోయావ్, ఇక నే సర్దుకుపోతాను" అంటే యీతని వ్యక్తిత్వానికి ఇంకా ఎక్కువ ఉత్తమత్వం ఏర్పడగలదు.

అత్తగారు మనకు పరిచయమయినా, లోగడవలె తెర వెనుకనే వుండిపోయింది. లోగడ అధ్యాయాలలోవలె కథకుని పాత్ర యిందులో లేదు. పేర్లుపెట్టడం కథాంశాన్ని నడపడానికి గాక– ఉత్తమప్రయోజనంకోసం కూడానని మీరు గ్రహించాలి. పేర్లు వ్యక్తుల గుణగణాల్ని తెలిపేవిగా వుండడం మంచిది. కాని; వ్యతిరేక గుణాలను స్ఫురింపజేసే పేర్లు పెట్టి– వ్యంగ్యధోరణిలో కథానికను రచించడంకూడా ఉత్తమపద్ధతే. కనుక వ్యక్తులకు పేర్లుపెట్టేటప్పుడు చాలా తూచితూచి పెట్టవలసి వుంటుంది. ఈ కథానిక "నగుబాటుపాలవుతామనే

మనస్తత్వంతో సంసారంలోని కష్టాలను సంతోషంతో స్వీక రించే స్త్రీలు వున్నారు'' అనే విషయాన్ని తెలియజేయడమే ప్రయోజనంగా గలది.

ఇక, స్త్రీ సంసారజీవితాన్ని సూచించడంలో కూడా వివరాలకుపోకుండా క్లుప్తపద్ధతి అనుసరించబడడం గమనార్హం. వివరాలతో నిమిత్తంలేకుండానే ఆమె సాంసారికజీవితంలోని అసంతృప్తికి కారణాలు—అత్త, భర్తల మనస్తత్వాలు పాఠకులకు అర్థమవుతున్నాయి గదా! ఇక, వివరాలవల్ల ప్రయోజనం అంతగా వుండదుగదా !

ఈ కథానికా ప్రయోజనదృష్ట్యానూ, శిల్పం దృష్ట్యానూ వివరాలు అనవసరం. కాని; కొన్ని ఉదాహరణల ద్వారా యిదే విషయాన్ని చిత్రించడం కొందరు కథకులకు అలవాటు. ఇలా చిత్రించడంలో యీ'కథానిక'ను, 'కథ'గా మార్చే ప్రమాదం వున్నదని కొందరు గుర్తించడంలేదు. దీనికి ఉదాహరణలను ముందుభాగాల్లో చూడండి.



# 11

శాంత నిద్ర లేచేసరికి ప్రొద్దెక్కింది. ఆమె జీవితంలో ఈరోజు చాలా విచిత్రమైనది. ఆ విచిత్రం నిద్ర లేవడంతోనే ప్రారంభమయింది. తా నింతకుముందెప్పుడూ తెల్లవారుఝాముస అయిదింటికి అయిదు నిముషాలన్నా ఆలస్యం చేయకుండా లేచేది. ఈనాడు బారెడు పొద్దెక్కినా—

ఇంకో విచిత్రం. పొరపాటున ఏనాడు తెల్లవారుఝామున అయిదింటికీ అయిదు నిముషాలు గడిచినా తాను లేవకపోయినట్లయితే, గదిబయటనిలచి, తలుపులు బ్రద్దలుగొడుతూ కేకలువేసే అత్తగారు- యింతవరకూ తనను లేపనేలేదూ! ఎందువల్లా?

రాత్రి జరిగిన హంగామా తరువాత ఆమె బుద్ధి మార్చుకుందనుకోవచ్చునా? అబ్బే! అలాంటిపని ఆమెగారు చచ్చినా చెయ్యదు. అనవే అందిగా రాత్రి— "నువ్వెంత గింజుకున్నా లాభంలేదు. నే బతికున్నంతకాలం నాయింట్లో, నామాట సాగవలసిందేగాని, నీ మాట వినేవాళ్ళెవ్వరూ లేరు"—అని! అలాటి అత్తగారు ఆ తర్వాత నిద్రపోవడంతో, తెల్లవారేసరికి గుణం మార్చుకుంటుందనేది కల్ల. కలలోకూడా జరుగని మార్పు.

అందువల్లనే తను నిశ్చయించుకుంది - ఇక నేమైనా సరే, ఆ యింట్లో తా నుండలేననీ, ఉండరాదనీ. రాత్రింతా

ఆ విషయమే ఆలోచించి ఆఖరుకు ఆ నిశ్చయానికొచ్చి కన్ను మూసిలది. ఆ ఆలోచనల అలసటవల్లనే తన కింత పొద్దెక్కే వరకూ మెలకువరాలేదు. ఇప్పుడుకూడా ఏదో వెలితిగా, బద్ధ కంగ్గా వుంది.

శాంత వళ్ళువిరుచుకుంటూ ప్రక్కకుచూచింది. పందిరి మంచంమీాద భర్త లేడు. మరీ విచిత్రం. ఎనిమిదింటికూ్కడా లేవని ఆయన ఈరోజు అప్పుడే లేచారే! ఆయనకూడా తల్లితో కలసి తన మీాద 'జాలి' పడి మనసు మార్చుకున్నారా లేక ఏదైనా ."కుట్ర" పన్నారా? ఈ అనుమానం కలిగేసరికి ఆమె ఛెళ్లున కొరడాదెబ్బ తగిలినట్లు లేచి మంచం మధ్య కూర్చుంది.

నిజంగా తన నిశ్చయం మంచిదా, కాదా? కాకపోవట మేమిటి. తన నిశ్చయం సరైనదే. లేకపోతే యింకెంతకాల మని ఆ నరకబాధ లనుభవిస్తుంది? త నేం తప్పుగా ప్రవర్తిస్తు న్నానని యిన్నిబాధలు భరించాలి. రాత్రి మట్టుకు రాత్రి తను చేసిన పొరపాటు ఏమిటి ?

ఆఫీసునుంచి వచ్చిన భర్తకు ఫలహారం పెట్టి, వారి ముందు కూచుని పూవులు గుచ్చుకుంటూంది. అంత మాత్రాన- "ఏం కొంప, భోగంకొంపయిపోయింది. ఇంకా ఊర పొద్దుగూక లేదు- పడగ్గదిలో పవ్వళింపా" అని సాధిం చడం ప్రారంభించింది అత్తగారు. తా నా మాటలు వినలేక బైటికి వెళ్ళి "పువ్వులు గుచ్చుకుంటున్నా నత్తయ్యా" అని

చెబితే—ఆమె "పువ్వులా! రోజూ అణా, అర్ధణా బెట్టి పువ్వులు కొనుక్కుంటే యింకా యీ కాపరం ఏం బాగుపడుతుందీ. అందుకే ఈ కొంప గుణ్ణమైపోతూంది" అంది.

తను "మీ అబ్బాయే తెచ్చారత్తయ్యా, నే కొనలేదు" అని చెప్పుకుంటే "అవు నవును; తెస్తాడు, తేడూ మరీ. నీకింద కుక్కిన పేనైపోయి ఎట్లా ఆడమంటే అట్లా ఆడతాడు. చాటుచాటున వాడికి నూరిపోసి, నాదగ్గర నంగనాచి కబుర్లు చెపుతున్నావే! అవునవును- ఎంతైనా నేర్చినదానివి. బొల్లావారి ఆడపడుచుకు బొల్లికబుర్లకేం తక్కువా" అంది.

శాంత "అదేంమాట లత్తయ్యా, ఇందులో మాపుట్టింటి ప్రసక్తి దేనికీ? అయినా-మీ అబ్బాయిని నే తెమ్మన్నానా. నా కొద్దూ అంటే ఆయనే తెచ్చారు. ఆయన మీ మాట వింటారుగాని నా మా టెపుడన్నా వింటేగా" అని చెప్పింది. దాంతో ఆమె చేతులు బారలుజాపుతూ—"ఏమిటీ - నా కొడుకు నామాటవింటే నీ కళ్లుకుట్టాయా? వాడు నామాట వినక నీమాట వినాలా? ఎంతమాటా—మగవాడే నీమాట వినాలంటావా—ఎంత తెగించావంటేనూ!" అంది. ఇంతలో భర్తకూడావచ్చి "ఏయ్. ఎందుకే వాదనా? లోపలికితగులడు" అని తననే గద్దించాడు.

"ఇప్పుడు నేనేం చేశానండీ" అంటే, తనమాట వినకుండా— "ఇంకేంచెయ్యాలి? వెధవవాదనా నువ్వూను. ఫో లోపలికి" అని గర్జించాడు.

ఇలా జరగడం ఇదొక్కసారేఅయితే—తానుపట్టించు కునేదేకాదు. రోజూ యింతే. చీటికీ మాటికీ నిష్కారణంగా. తనను ఆరళ్ళుపెట్టడమే అత్తగారిపని. ఆమెను గద్దించవల సిందిపోయి భర్తకూడా తననే చెప్పుకిందనొక్కిపడుతూంటేని. ఏ ఆడదైనా పదేళ్ళపాటు ఇంత బాధపడుతూ వూరు కోలేదు. సహించలేదు. శాంతానికీ ఒక హద్దువుంది.

అందుకనే తను చేతిలోని పూలచెండు ఆవలకు విసి రేసి—"మీరూ అలానే అంటున్నారా. పడేదాన్ని వున్నాను. గదా అని అనవసరంగానే ఆరళ్ళుపెట్టడమా. ఇక నేను పడ లేను..." అంటూ గదిలోకి వెళ్ళి కుక్కిమంచంలో కూల బడింది.

అత్తగారు "ఆసి భడవా! ఎంత దురుసూ? అట్లా చూచావట్రా ఆ వరస! సత్యభామలాగా అదిరిపాటా— ఇంతోటిదానికీ. ఆ పూలు విసరడం, ఆ రంకెలూ—ఏం ఆడ దిరా అదీ" అంది. ఆయన "నువ్వూరుకోవే ఇక—తోచ నివ్వవూ" అని విసుక్కున్నారు. దాంతో ఆమె శోకాలు మొదలెట్టింది — "అవున్లే - నే నెందుకు పనికొస్తానూ. వూరికే అన్నారా పెళ్లాం బెల్లమూ, తల్లి విషమూనని! ఎంతచేస్తేనేం, ఎంత సంపాదించి యిస్తేనేం? తల్లిని మాట్లాడ గూడదన్నమాట" ఇక ఆ ప్రవాహానికి అంతులేదు.

ఆయన చరచరా లోపలికివచ్చి "నీకు మరీ వళ్ళూపై తెలియడంలా. ఒక పెద్దా చిన్నా లేకుండాపోయింది" అని తనను చివాట్లువేశారు. తను చెప్పేసింది— "ఇక నే నీ కాపు

రం చెయ్యలేను. ఎంత నోరుమూసుకుపడున్నా, ఎంత వినయంతో మణగివున్నా నాకీ రంపపుకోతమాటలు తప్పడం లేదు. పదేళ్లుగా యీ నరకయాతన సహించాను. అయినా మీరుకూడా నన్నే నెపపెడుతున్నారు. ఇంకా నాకీ కాపురం ఎందుకు, పోతాను. మా వాళ్ళింత కూడు వెయ్యలేకపోరు" అని.

"పోతావ్వూ—సిగ్గూ తప్పూ లేకపోతేసరి. నోరుమూసుకు పడుకుంటావా లేదా." అని గద్దించి ముసుగుతన్ని పడుకున్నాడు. అత్త సాధింపులు అంతులేకుండా సాగుతున్నాయి.

మరో గంటకి అత్త కొడుకును పిలిచి అన్నంపెట్టి, తనూ తిని పడుకుంది. ఆయన వచ్చి పడుకున్నాడేగాని తనను అన్నం తినమని అడగనన్నా లేదు... అందుకనే తెల్లవార్లూ ఆలోచించి ఆ నిశ్చయానికి వచ్చింది.

(గత అధ్యాయంలోని 2 వ పేరానుంచీ మళ్ళీ చదివి ఈ కథానికను పూర్తిచెయ్యండి.)

   

క్రిందటి కథానికకు రెట్టింపు దీర్ఘంచేయబడిన ఈ కథానికలో కొత్తగా ప్రివేశపెట్టబడిన దేమిటి? శాంత కుటుంబంలో అనవసరంగా ఎలాంటి బాధలు పడుతున్నదో తెలియజేసేందుకు ఒక చిన్న సంఘటనను ప్రారంభంలో వివరించడమైనది. ఈ ఒక్క సంఘటనకు బదులుగా నాలుగైదు సంఘటనలను ఉదహరించి కూడా దీనిని రచించవచ్చు.

అయితే—ఈ అధ్యాయంలో ఒక రాత్రి జరిగిన సంఘటన ఒకటీ; మరునాటి వుదయం జరిగిన సంఘటన మరొకటీ కూడా చిత్రించబడ్డాయి. అందువల్ల మొదట మనం నిర్వచించుకున్న ప్రకారం యిది "కథానిక" కాక, "కథ" అవుతుందేమోనని కొందరికి అనుమానం కలుగవచ్చును. కాని, ఇది శిల్పదృష్ట్యా "కథానిక"యే అవుతున్నది. ఎలాగు ?

ఇది శాంత 'నిశ్చయం'తో ప్రారంభమైంది. ఆ నిశ్చయ పరిణామంతో అంతమయింది. మధ్య సందర్భవశాత్తు ఆమె వూహాలద్వారా మరొక సంఘటన వివరించబడింది. అందువల్ల ఇది ఒకే సంఘటనచుట్టూ అల్లబడిన కథ. కనుక ఇది 'కథానిక' మాత్రమే అవుతుంది. కాని, 'కథ' కాజాలదు.

అయితే, ఆ యా పూర్వసంఘటనలను కథానికలోని పాత్రల స్మృతులుగా సూచించకుండా, వరుసగా వర్ణించినట్లయితేమాత్రం యిది 'కథానిక' కాక 'కథ' అయిపోతుంది. మనం రాత్రి జరిగిన సంఘటనను వర్ణించి, శాంత నిశ్చయమూ దాని పర్యవసానమూ చిత్రించినపుడుకూడా అది ఒకే సంఘటన వివరణ అవుతుంది గనుక 'కథానిక' గానే వుంటుంది. అలా గాక— శాంత గతజీవితంలోని మరొక సంఘటనతో ప్రారంభించి, ఈ రాత్రి, ఈ వుదయమూ జరిగిన సంఘటనలను వరుసగా వ్రాసినట్లయితే మాత్రం అది "కథ" అవుతుంది.

కనుకనే "కథానిక"కు ఒక బలవత్తరమైన సంఘటననే ఎన్నుకోవడం మంచిది. అత్యవసరమైనప్పుడు మాత్రమే ఆ

కథానికలోని పాత్రల ఊహాలోకాన్ని అనుసరించి పూర్వ సంఘటనలు గాని, భవిష్యదూహాలు గాని చిత్రించవచ్చును.

ఈ అధ్యాయంలోని "కథానిక"ను మరొకసారి చదవండి. ఇందులో- పాఠకుల విమర్శనా దృష్టిని పరీక్షించడం కోసం రెండువాక్యాలు లోపింపజేయబడ్డాయి. అవేమిటి ?

ఇందులో శాంత మనస్తత్వమూ, అత్తగారి ధోరణీ పూర్తిగా కథకుడే చిత్రించాడు. శంకరం మనస్తత్వం కొంత భాగం మాత్రమే చిత్రించబడి, ఎక్కువభాగం పాఠకుల ఊహాపోహలకు వదలబడింది. ఈవిధంగా చేయడంలో కథకుని తప్పులేదు సరిగదా- అలా సూచించి వదలడంలోని 'నిగ్రహం' ఉత్తమ రచయిత లక్షణం. మరి వున్నలోపమేమిటి ?

అత్త, భర్తల మనస్తత్వాల దృష్ట్యా- ఆ రాత్రి జరిగిన సంఘటననుబట్టి, మరునాటి వుదయం ఆ యిద్దరూ లేచి కుటుంబపుపనులలో పూనిక చూపడమూ, శాంతను లేపకపోవడమూ అసంభవం గాకపోయినా కొంత అసమంజసంగావుంది. ఇలాటి మార్పుకు కారణం శాంతకు దొరకలేదు. దీనికి గల కారణాన్ని బహుకొద్దిమందిమాత్రమే గ్రహించగలుగవచ్చును గాని, ఎక్కువమందికి సందేహం తీరదు. కనుక రచయిత కొంత విఫలుడయ్యాడని అనుకోవచ్చు.

ఆ యిద్దరిలోనూ వచ్చినమార్పును ఏదో ఒకచోట కథకుడు సూచించవలసింది. శాంతను బతిమాలుతూ నచ్చజెపుతున్నప్పుడు శంకరం "సంసారమన్నాక అనేకంవుంటాయ్.

ఏదో సర్దుకుపోవాలి గాని..." అంటాడు. ఆ సందర్భంలోనే- "ఇంతకాలమూ నువ్వు సర్దుకుపోయావ్. అది గ్రహించమనే రాత్రి మా అమ్మకుచెబితే, ఆమెకునచ్చలేదుగాని- ప్రొద్దున్నే ఏదో మారినట్లే వుంది సుమా." అనే రెండు వాక్యాలూ చేరిస్తే చాలా బాగుంటుంది.

ఈ రెండు వాక్యాలవల్ల అత్తగారిలోమార్పుకుకారణం ఏర్పడడమే గాక, శంకరం మనస్తత్వం ఉత్తమంగా చిత్రించ బడుతుంది. అతనికి శాంత స్వభావం పూర్తిగా తెలుసుననీ, తల్లి మనస్తత్వాన్ని సరిదిద్దలేక భార్యనే గద్దించేవాడనీ ఆవిధంగా కుటుంబ సంఘర్షణను తగ్గింపజూచేవాడనీ మనకు తెలుస్తుంది. ఈ రెండు వాక్యాల ప్రభావాన్ని యిప్పుడు మీరు పరిశీలించగలరు.

ఈ పరిశీలనదృష్ట్యా మీరు మరొక విషయాన్నికూడా గుర్తుంచుకోవాలి. వ్యక్తుల మనస్తత్వాలను చాలా మెలకువతో చిత్రించే నేర్పు అవసరం. ఆ వ్యక్తులువుచ్చరించే ప్రతి పదమూ ఆ మనస్తత్వానికి తగివుండాలి. ఎవరిలోనైనా క్రమ పరిణామం కలుగుతుంది. హఠాత్తుగా మనస్తత్వం మారిపోవడం (విపరీత సంఘటనలలో తప్ప) అసహజంగా వుంటుంది. అందువల్ల మార్పుకు బలవత్తరమైన కారణాలు, సహజమైన సహేతుకాలు సృష్టించబడితేనే ఉత్తమరచన తయారవుతుంది.

ఈ పరిశీలనదృష్ట్యా అత్తమనస్తత్వంమార్పుకు కారణం సహేతుకమైందిగావుంది. మొదట రచింపబడిన "కథానిక"లో హఠాత్పరిణామంగా కన్పించడం గమనించండి. ఇప్పుడు

పేర్కొన్న రెండు వాక్యాలవల్లా ఆమెలోని మార్పుకు చక్కని కారణం చూపబడింది. అప్పటికీ కూడా—ఆమె పూర్తిగా మనస్సు మార్చుకుని కోడల్ని దేవతగా - కనీసం సమానురాలుగా చూచుకునే పవిత్ర హృదయ, ప్రేమ హృదయ కాలేదు.

"వంటయింట్లో పాత్రలకు బుద్ధిచెబుతూంది" అనే మాటలవల్ల ఆమెలో ఇంకా పూర్వపు దురుసుతనం మాయలేదని రుజువవుతూంది. కాని, శాంతను ప్రొద్దెక్కినా లేపకుండా, వంటయింటి పనిలోవున్నట్లు సూచించడంవల్ల "మార్పు"కు పునాదులేర్పడ్డాయని గ్రహిస్తున్నాం.

ఈ సహేతుక పరిశీలనను మీరు బాగా అవగాహన చేసుకున్నట్లయితే - కథానికలోని ప్రతివాక్యమూకూడా తూచితూచి వాడవలసివుంటుందనేది గ్రహించగలరు. పాత్రల మనస్తత్వాలనూ; విషయప్రయోజనపరిణామాలనూ కూలంకషంగా మనసులో చిత్రించుకుని, వాటి కనుగుణంగా రచన సాగించినప్పుడే ఉత్తమకథానిక (ఉత్తమరచన) తయారవుతుంది.

# 12

శాంత గదిలోకూర్చుని పువ్వులచెండు కుడుతూంది. వంటయింట్లోనుంచి గంగమ్మగారు అంటున్న మాటల్ని సాయంకాలపు చల్లగాలి మోసుకొచ్చి శాంతచెవుల్లో వేయాలని వృధాప్రయత్నం చేస్తూంది. పైగా ఆ గాలివల్ల శాంత మనోల్లాసాన్ని పొందుతూంది. అప్పుడే స్నానంచేసిన శరీరానికి ఆ చల్లనిగాలి, విచ్చబోతూన్న మల్లెపూలవాసనా, భర్త రాగానే వెళ్ళబోతున్న సినిమాను గురించిన వూహాలూ మధుర మధురంగా పులకలెక్కిస్తున్నాయి.

భుజంగరావు ఆఫీసునుంచి వచ్చి కోటు విప్పుతున్నాడు. శాంత త్వరత్వరగా చెండుకుట్టడం ముగించడంలో నిమగ్న మయి "త్వరగా మొఖం కడుక్కు రండి" అంది. అతడు దొడ్లోకి వెళ్ళి చెంబు గానక, మళ్ళీ గుమ్మంలోకొచ్చి "చెంబేదీ ?" అని అడిగాడు. శాంత పూలు సింగారించు కుంటూ—"వంటింట్లో మీా అమ్మవుంది అడగండి"అంది.

భుజంగరావు "అమ్మా" అని పిలిచాడు. గంగమ్మ గారు బెండకాయవేపుడును తిప్పుతూ, వెనుదిరిగిచూచి— "అదేమిట్రా-ఆ రాణీగారు చెంబుతో నీళ్ళే యివ్వలేనంత పనిలో వుందా ? మగవాడు సతమతమై ఇంటికొచ్చాడంటే ఎంత యిదిగా వుండాలి! దానికసలు లక్ష్యమేలేదయ్యే" అనడం సాగించింది. అతడు ధుమధుమలాడుతూ లోపలికెళ్ళి చెంబు తీసుకుని దొడ్లోకి నడిచాడు.

గుమ్మం దాటుతూండగా శాంత సుడిగాలిలా వంటింట్లోకి తోసుకొచ్చి—"ఇష్టముంటే చెయ్యండి, లేకపోతే లేదుగాని! ఏమి టా సాధింపూ? నేను పూలు కుట్టుకుంటున్నాను గానీ, ఊరికే కూర్చోలేదు—రాణీ గీణీ అంటున్నారే-అంత దశకూడానా యీ యింట్లో" అని దులిపేశింది. గంగమ్మ గారు పొయిమీదివేపుడును దింపి, తిరగమోత వస్తువులు తీస్తూ—"ఇప్పుడు నే నేమన్నాననే అంత విసురూ? వాడు చెంబుకోసం దేవుళ్ళాడుతూంటే యివ్వలేవా అన్నాను. పూల కిప్పుడేం తొందరా, తర్వాత కుట్టుకోవచ్చుగా" అంది.

శాంత తిరిగివెళుతూ, ఆగి—"తొందరో కాదో మీ కెందు కసలూ—అవతల సినిమాకి వేళయిపోతేనూ"అంది. గంగమ్మ మిరపకాయలుగిల్లి మూకుట్లోవేసి—"అవునమ్మా, రోజూసినిమాలే నీకూ. అదేగా పనీ,యిం కేముందీ?"అందిమూతి ముడుస్తూ. శాంత "మాయిష్టం; మేం సినిమా కెళ్ళకుండా వుండలేం. అయినా మీ గొడవేమిటి మాకూ"అంటూ పడక గదిలో కెళ్ళిపోయి చీరసెలెక్షన్లోపడింది.

గంగమ్మ "అదీ వరస. రోజుకు పావలా పూవులూ, వచ్చిన సినిమాకల్లా రూపాయలూ తగలబెట్టేస్తున్నారు. అందుకనే కాపరం యిట్లా గుణ్ణమయిపోతోంది. అది వుసి కొల్పడం, వీడు భళీ అనడం. బాగానేవుంది!" అంటూంది. భుజంగరావు లోనికొచ్చి ముఖంతుడుచుకుంటూ శాంతను "మరీ చిన్నా పెద్దా లేకుండాపోయింది. నీకు నోటికెంతవస్తే అంతా వాగడమేనా? ఏమి టా దురుసూ?" అని గద్దించాడు. ఆమె తోకతొక్కినతాచులా ఛరుసున తిరిగి 'మీరూ ఆవిడ

గారిచే సమర్థిస్తున్నారూ? అవున్లెండి—నేనేగా పరాయి వాళ్ల బిడ్డనీ. మీరూ మీరూ ఒకటే. అనండి అనండి" అంటూ బుంగమూతిపెట్టింది.

భుజంగరావు పళ్లు కొరుకుతూ—"ఇప్పు డేం అనరాని మాటలన్నా రేం నిన్ను? ఉన్న మాటంటేఉలు కెక్కు—వంట! పైగా ఎదురు నెపమూ, ఛీ" అని, మంచంమీద విసుగ్గావాలాడు. శాంత పూలచెండు తలలోంచి తీసిపారవేస్తూ—'నోరుమెదిపితే చాలు పళ్లునూరుతారు. ఆ అలుసు చూచుకునే ఆవిడ యిష్ట మొచ్చినట్లల్లా అంటూంది. ఇక నే నిది పడలేను. జీవితమంతా అత్తగారి ఆరళ్ళూ, భర్తగారి గద్దింపులూ అయితే, ఎందు కి కాపరం...నే నిక చచ్చినా వుండలే నిక్కడ''అని, పెట్టెమూత దభాలున తీసి అటువిటూ ఇటువటూ సర్దసాగింది.

"ఏడ్చావులే-నోరుమూసుకో యిక. పెట్టెదగ్గర్నుంచి లేచి, ఆ పువ్వులపీ సర్దుకో—సినిమాకెళదాం'' అంటూ భుజంగరావు లేచి తను బట్టలు మార్చుకోసాగాడు. శాంత "నా కేమీ అక్కర్లేదు. మీ మాయమాటలకూ గద్దింపులకూ జడిసే యిన్నాళ్ళూ పడివున్నాను. ఇక చస్తే మాటపడను.'' అంటూ లేచి బైటకు నడవబోయింది. ఇంతలో గంగమ్మగారు వాకిట్లోకొచ్చి "అదేం విడ్డూరమే. మొగుణ్ణి కొట్టి మొగసాల యెక్కినట్లు-మమ్మల్నే అంటూ మమ్మల్నే నెపపెడుతున్నావా?'' అంది.

శాంత "నేనేం మీతో మాట్లాడ్డంలేదు. అసలు మీతో నా కింకేమీ పనిలేదు. మీ కెక్కువైనా, మా కన్న

వాళ్ళకేం ఎక్కువగాను'' అంటూ బైటకెళ్ళిపోయింది. రోడ్డున వస్తున్న రిక్షా నాపి, ఎక్కి "పోనియ్ బస్సుస్టాండుకి'' అంది. రిక్షా సాగింది.

రిక్షా పాతికగజాలు వెళ్ళేసరికి భుజంగరావు పరుగు పరుగున వెంటాడుతూ– "ఆగూ–ఆగవోయ్'' అని కేకలువేయ సాగాడు. ఆమె హెచ్చరించడంవల్ల రిక్షా ఇంకా జోరుగా పోతూంది. మరో పదిగజాలు వెళ్ళేసరికి భుజంగావు రిక్షాదగ్గరకు జేరి, చక్రంపట్టుకుని ఆపి– "వెనక్కు తిప్పవోయ్– తిప్పు'' అని రిక్షావాడిని గద్దించాడు శాంత "వద్దు– పోనియ్ ముందుకు' అని గర్జించింది. రిక్షావాడు తటపటాయించాడు.

భుజంగరావు "వద్దు... నా మాట విను... వెనక్కి పోదాం పద'' అంటూ శాంతముఖంలోకి జాలిగా చూచాడు. ఆమె పమిటచెంగును బొడ్డులో దోపుకుంటూ, ముఖం కంద గడ్డలాచేసి "నేనాను. మీాయిల్లూ, కాపరం నా కక్కర్లేదు... ఏ మొఖంపెట్టుకుని అడుగుతున్నారూ, రమ్మనీ? '' అంది. మళ్ళీ "వెళ్ళండి, ఆవిడగారి మాటలతోనే వూరేగండి'' అని– రిక్షావాణ్ణి "పోనియ్‌రా'' అని కేకేసింది.

భుజంగరావు ఆతురతతో అటూ యిటూ చూచాడు. సందెచీకటిని పారద్రోలే లైట్ల వెలుతురులో జరుగుతున్న ఈ సంఘటనని కుతూహలంతో చూచేందుకు చేరినజనం గుసగుస లాడుతున్నారు. అతని గుండెలు బిక్కుబిక్కు మన్నాయ్. ఆమెతో ప్రార్థనాపూర్వకంగా– "చూడు, నలుగుర్లోనూ నగు బాటు. నన్నిట్లా అనవసరంగా అభాసుచెయ్యడం న్యాయ

మేనా? ఇది నీకూ నాకూకూడా మంచిదికాదు. ఇంటికెళ్ళి మాట్లాడుకుందాం- పద" అన్నాడు.

శాంత చెయ్యి నటూ యిటూ ఊపుతూ- "ఓయబ్బ! ఎన్ని తియ్యని కబుర్లయినా చెబుతారు. ఎంతసేపూ నన్నే గద్దిస్తారు గాని, ఆవిడ నేమీ అనరు. నా మాటకు విలువ లేనప్పుడు నే నెందు కా యింట్లో?" అంటూ ముఖం అవతలి వేపుకు తిప్పింది. భుజంగరావు గద్గదికంగా- "కాదు శాంతా, ఎప్పుడు నీమాట కాదన్నాను? ఆమె అయినా మన మంచిని కోరేగదా బండెడు చాకిరీ చేస్తూన్నది. ఏదన్నా చెబితే వినాలిగాని— గల్లంతెందుకూ? అయినా, ఆమె నిక నేమీ మాట్లాడొద్దని చెబుతా గానీ— పద. నీయిష్టమే కానియ్." అని చెప్పాడు.

ఆమె "ఊఁ" అంటూ పెదిమెలు సడలించి, చెంగు తీసి విలాసంగా కప్పుకుంది. అతడు సంతోషంగా "పదవోయ్ రిక్షా—సినిమాకి" అన్నాడు. హుషారుగా పోతున్న రిక్షాని అనుసరించాడు— విజయవిలాసంతో జనాన్ని చూస్తూ.

* * * *

ఇదికూడా కథానికే. కాని, పేర్లు పెట్టడంలో వ్యతిరేకోద్దేశాలు కలిగించి—చివరికిగాని అసలు స్వభావాల్ని తెలియజేయడం జరగలేదు. ఇందులో పాఠకుల ఫూహకు ఏమీ వదలబడలేదు. కథకుడు పాత్రలద్వారానే అన్నీ వివరించేశాడు.



# 13

ఒక్కో కుటుంబజీవితాన్ని చూస్తూంటే– అతి స్వల్ప విషయాలలో కూడా నరక సమమైన సంఘటనల్ని సృష్టించుకుంటారు దేనికా అనే ప్రశ్న ఉదయించడమేగాక, ఆ కుటుంబం చాలా విచిత్రంగా వికృతంగా కనిపిస్తుంది. మా యింటికెదురుగా వుంటున్న శంకరం కుటుంబాన్నే చూడండి—

ఆ కుటుంబంలో వున్నది ముగ్గురు. శంకరం విద్యావంతుడు, సహనశీలి. చిన్న ఉద్యోగస్తుడు. తనకు తెలిసినంతలో అందరిమెప్పు పొందాలని ప్రయత్నిస్తాడే గాని, ఒకరికీ హానికరంగా ప్రవర్తించడు. తన గొడవ తనదేగాని, ఇతరుల జోక్యం పట్టించుకోడు. సాధ్యమైనంతవరకూ తాను అన్నిటికీ సర్దుకుపోతాడేగాని, కీచులాటలూ, సంఘర్షణలూ అతనికి పనికిరావు.

అతనిభార్య శకుంతల కూడా చదువుకున్న నాగరికురాలు. మంచీ చెడూ తెలిసి మెలిగే స్వభావం ఇరుగు పొరుగులో ఎవర్నడిగినా "మంచిది- చాలామంచిది' అని చెబుతారే గాని, ఆమెనుగురించి ఎవరూ పల్లెత్తుపొరపాటు చెప్పరు. భర్తఅంటే ప్రాణం; తానంటే అభిమానం.

ఇక శంకరం తల్లి రత్తమ్మగారు కూడా పెద్దమనిషి తరహా గలది. తనకున్న అభిప్రాయాలను నిర్మొహమాటంగా బైటపెట్టే మనిషి. తన కుటుంబ గౌరవ—మర్యాదలన్నా, స్థితి

గతులన్నా ప్రాణంకంటే ఎక్కువగా చూచుకుంటుంది. ఒకరిది కానీ కావాలనుకోదు, తన దొక కానీ అనవసరంగా ఒకరికీ పోనియ్యదు.

సజాసికి ఈ ముగ్గురిలో ఎవరినీ 'చెడ్డ' అని ఎవరూ అన లేరు. అంతా మంచివాళ్ళే. విచిత్రమేమిటంటే—అటువంటి సౌమ్యులు ముగ్గురుగల ఆ కుటుంబంలో ఎప్పుడుజూచినా ఏదో ఒక యుద్ధం జరుగుతూనే వుంటుంది. ఎవరికీ శాంతిలేదు. అయి దారేళ్ళుగా నేను చూస్తున్నాను. ఆ ముగ్గురిలో ఎవరూ తృప్తిగా జీవిస్తున్నట్లు నాకు తోచలేదు.

ఆరోజున సాయంకాలం చల్లగాలికి మా యింటిముందు వరండాలో కుర్చీవేసుకు కూచున్నాను. ఆ యింట్లో జరిగే యుద్ధధ్వనులు నాకు స్పష్టంగా వినిపించసాగాయి. ఈ కుటుంబ వ్యవహారం ఏదో చాలా విచిత్రంగా తోస్తున్నది—దీని సంగ తేదో తెలుసుకోవలసిందే నని కుతూహలపడి శ్రద్ధగా ఆలకించసాగాను.

ఆ అత్తా కోడళ్ళమధ్య కీచులాటకు కారణంగా తేలిన సారాంశం ఏమిటంటే— ఆరోజున శకుంతల కొత్తచీర కట్టు కుని, పూలచెండు కుడుతూంది. భర్త ఆఫీసునుంచి వచ్చి నీళ్ళ చెంబుకోసం వెదుక్కోలేక విసుక్కుంటున్నాడు. వంటపనిలో వున్న రత్తమ్మగారు– "అట్లా పడగ్గదిలో చేరకపోతే నీళ్ళన్నా యివ్వలేదూ!" అని కోడలి నుద్దేశించి అంటూ– "రాణీగారికి లక్ష్యమే లేదమ్మో" అంది.

అందుమీాద శకుంతల తను సినిమాకెళ్ళాలనే తొందరలో, పూలు కుట్టుకుంటున్నాననీ, అందువల్ల భర్తకి నీళ్ళివ్వ లేకపోయాననీ చెప్పుకుంది. దాంతో రత్తమ్మగారికి వళ్ళుమండి "సినిమాలు, పూలతో కొంప కుణ్ణమైపోతూంది" అంది.

తనకు బొత్తిగా స్వేచ్ఛ లేకుండాపోయిందని, ఒక సినిమాఅనీ, పూలనీకూడా లేకపోతే యింక సంసారంలో సుఖమేమున్నదనీ శంకుంతల వ్యసనపడింది. ముసలావిడేదో మన మంచికోసమే చెప్పిందిగదా, యీా రాద్ధాంతమెందుకని-అలిగినభార్యను గద్దించాడు శంకరం. దాంతో శకుంతల— తన మాటకు విలువలేకుండాపోయిందనీ, అత్తఆరళ్ళు, భర్త గద్దింపులూ యిక భరించలేననీ చెప్పేసింది.

భరించక చేసేదేముందని అత్తగారంటే: తన పుట్టింటి వాళ్ళకు తానెక్కువ కానని కోడలుగారన్నది. తెగతెంపులు చేసుకునే మాటలు తగవని భర్త గద్దించితే - ఏడుస్తూ పడుకుంది శకుంతల. ''అనవసరపు ఏడుపెందుకూ, పోవల్సొచ్చి కుంటే పో; లేకపోతే నోరుమూసుకుపడుకో అన్నాడు''శంకరం.

ఇలా స్వల్ప విషయానికి యింత రాద్ధాంతం జరగడం విచిత్రంగాదూ మరీ. శంకరానికి సమయానికి చెంబుకన పడితే ఏ గొడవా వుండేదిగాదు. పోనీ, అత్తగారు చెంబిచ్చి మెదలకుండా వూరుకున్నా గొడవలేకపోను. ఆ తర్వాత 'ఆమె వాజ అంతేలే' అనుకుని శకుంతల వూరుకున్నా సరిపోయేది. ఇలా మాటమీాద మాట పెరగడం ఎందువల్ల? ముగ్గురిలో ఎవరిమట్టుకువారు తమ మంచితనంమీాద నమ్మకం అభి

మానం గలవాళ్ళు కావడంవల్ల, ఎవరిమట్టుకువారు ఎదుటి వారిలో సహజంగావుండే చిన్నచిన్న పొరపాట్లను అర్థం చేసుకోలేకపోవడంవల్ల, ఎవరికివారే తమ ప్రవర్తన నిర్దుష్ట మనుకోవడంవల్లాను.

అయితే, ఇలా చీటికీ మాటికీ కుమ్ములాడుకునేవాళ్ల కాపురం ఇన్నేళ్లు ఎలా సాగిందా అనేదికూడా నాకు కొరకరాని—సమస్యగా తోఛింది కాని,—

మర్నాడుఉదయం నేనులేచిముఖంకడుక్కుంటూండగా శకుంతల చరచరా తమ యింట్లోనుంచి బైటకువచ్చి, రిక్షాను పిలిచి ఎక్కి వెళ్ళడం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. పొద్దున్నే ఎక్కడకు వెళ్తున్నదా అని ఆలోచిస్తూండగా—శంకరంకూడా బైటకువచ్చి "ఆగూ - ఆగవోయ్" అని కేక లేస్తూ రిక్షావెంట పరుగెత్తాడు.

[ఇక్కడ 2 వ అధ్యాయంలోని 2 వ పేరానుంచీ కలుపుకొని చదివి కథను పూర్తిచేయండి]



ఇది 'కథ' కు ఒక ఉదాహరణ, కథానికలో ఒకసంఘటన చుట్టూ అల్లబడిన రెండు దృశ్యాలూ యిపుడు విడివిడిగా వర్ణింపబడినాయి. అంతేగాక, కథకుడు ప్రారంభంలోనే ఒక సంఘటనను తీసుకోక పాత్రలను గురించి పరిచయంచేస్తూ, తన అభిప్రాయాలను జోడిస్తూ రెండు వేర్వేరు సంఘటనల ద్వారా తన ప్రశ్నలకు తానే సమాధానంచెప్పడం జరిగింది.

ఒకటికంటే ఎక్కువ సంఘటనల ఆధారంతో చెప్పబడిన కథ గనుక ఇది 'కథానిక' గాక 'కథ' అవుతున్నది. ఈ

అధ్యాయంలోని రెండు సంఘటనలనూ కలిపి ఒకే సంఘటన చుట్టూ అల్లిన 'కథానిక' ను మీరు లోగడ చూచారుగదా. ఈ అధ్యాయం ప్రారంభంలో రచయిత పాత్రలను పరిచయం చేసిన పేరాలనుకూడాకలిపి "కథానిక" గానే రచింపవచ్చును. గ్రంథవిస్తరణభీతితో అధిక ఉదాహరణలు ఇవ్వలేకపోతు న్నాము. కనుక మీ రా విధంగా వ్రాసి చూడండి.

ఈ "కథ" లో పాత్రలచిత్రణ లోగడ అధ్యాయా లన్నిటికంటే విభిన్నంగా వున్నసంగతి మీరు గ్రహించే వుంటారు. అది ఎలా సాధ్యమయిందో, సంగ్రహ సంభాష ణలూ, వాటికి రచయిత యిచ్చిన భాష్యాలూ దీని కెంత తోడ్పడ్డాయో పరిశీలించండి.

ఇన్ని అధ్యాయాలు చదివాక మీ రాలోచించి తెలుసుకోగల విశేషం మరొకటుంది. కొన్ని కథానికలలో 'రిక్షా' ప్రయాణంవల్ల కొంత ప్రయోజనం సహేతుకత లున్నాయి. కొన్ని సందర్భాలలో 'రిక్షా' అవసరంలేదు. ఆమె వెళ్ళి పోతూంటే, భర్త ఆపి వెనక్కు తీసుకు రాగలిగినట్లు చిత్రించడమే ముఖ్యంగాని, రిక్షా, జెట్కా వగైరాసాధనాలు అనవసరంగా కనిపిస్తాయి. 'కథ'లలో కొన్ని కొన్ని అనవ సరంగా వాడుకోబడినా—కథానికలలో మాత్రం అత్యవసర మైనవాటినే వాడాలనే అభిమంతం గలవాడను నేను. ఇది రచయిత రుచులకు సంబంధించిన విషయం.

# 14

సుశీల అల్లారుముద్దుగా పెరిగి, శ్రద్ధగా చదువుకుని, సలక్షణంగా పెళ్ళిచేసుకుని, గుట్టుగా కాపురంచేసుకుంటున్న యువతి. కొందరు విద్యావంతులైన వర్తమాన యువతులవలె ఆమెకు విపరీత స్వాభిమానం గాని, స్వేచ్ఛాప్రవర్తనాకాంక్ష గాని, తన పెత్తనమే సాగాలనే పట్టుదలగాని లేవు. అందు వల్లనే గాబోలు స్నేహితురాండ్రు 'సుశీల వట్టి అమాయకు రాలు' అంటూంటారు.

ఆస్తిపాస్తులున్నప్పటికీ, దాసీలను పెట్టుకోమని భర్త చెప్పినప్పటికీ కూడా ఇంటెడుపనులూ తానే చేసుకుంటూ, అత్తమామల కణగి మణగి వుంటూ కాలం గడుపుతూంది. కాని, కాలం గడచినకొద్దీ ఆమె ఆశించిన సుఖం, తృప్తీ చేకూరడంలేదు. తన ప్రయత్నలోపం లేకపోయినా జీవి తంలో ఒకవిధమైన అశాంతీ, భయం పెనవేసుకుంటు న్నాయ్. అవే విచారంగా మారి ఆమెను పీల్చి పిప్పిచేస్తు న్నాయి.

కాపరానికి వచ్చిన కొత్తలో కూడా ఆమె యెంతో పుష్టిగా, ఆరోగ్యంగా, ముచ్చటగా వుండేది. ఆ తర్వాతయినా ఆమెకు ఒక జబ్బుచేయడంగాని, చెప్పుకోదగ్గ కుటుంబహాని సంభవించడంగాని జరగలేదు. అయినా ఆమె అంత చిక్కి పోవడం, ఎప్పుడూ దిగులుగా వుండడం పరిణమించిది.

అందుకనే ఆమధ్య ఒకనాడు భర్త కామేశ్వరరావు—"ఎప్పుడూ ఏడుపుమొఖం పెట్టుకూర్చుంటావేం? రాత్రి పూటన్నా కాస్త హుషారుగా వుండకూడదూ" అని ఆముదం తాగినట్లు ముఖం చిట్లించాడు సుశీల కా మాటలు కొరడా చురకల్లా తగిలి---"అదేమిటండీ, నేనేం విచారంగా లేనే. ఎప్పుడూ మీ సంతోషానికి తక్కువచెయ్యలేదే. ఎందుకండీ అలాగంటారూ?" అంది బేలముఖంతో.

✓ అతడు "అవునవును,కనపడుతూనేవుంది, ఆ పాతచీరా—దుబ్బుజుట్టూను— భలే హుషారుగా వున్నావ్." అని వెక్కిరించాడు. సుశీల "ఇవ్వాళేమిటో బద్ధకంగా వుండి గుడ్డలు మార్చుకోలేదండీ. అయినా, యీ చీరకేమండీ— ఎక్కడా చిరుగన్నా పట్టలేదు" అంది. అతడు "హుఁ, నీకు, చీరలు కూడా కొనకుండా హీనంచేస్తున్నారు గదూ— ఇక చింకి పేలికలుకూడా కట్టుకో, మహాసోయగంగా వుంటుంది" అని అటు తిరిగి పడుకున్నాడు.

సుశీల నోరుబాదుకుంటూ "అవ్వవ్వ! ఎందుకండీ అలా సూటీపోటీమాటలంటారూ? మీరు నన్ను హీనపరుస్తారని కలలోనైనా అంటానా? తప్పేలెండి. వెళ్ళి యిప్పుడే మార్చుకొస్తానులెండి— క్షమించండి" అంటూ ఆవలిగదిలోకి వెళ్ళింది. మంచి బట్టలు వేసుకుని, తల దువ్వుకుని, పౌడరు రాసుకుంటూ యీవలికొచ్చేసరికి హాలులో పడుకున్న అత్త గంగమ్మగారు చివాలున లేచి, మంచం మధ్య కూచుని—"అయ్యయ్యో! ఏం విడ్డూరం! అర్ధరాత్రికాడ యీ వేషా

లన్నీ ఏమిటే? ఇదేమన్నా సంసారుల కొంపేనా?" అంటూ ముక్కుమీద వేలేసుకుంది.

సుశీల వణుకుతూ "లేదత్తయ్యా! సంధ్యవేళ బద్ధకించి తేనూ–" అని చెప్పబోయింది. ఆమె మాటలు సాగకుండా అత్తగారు– "అయితే వున్న గుడలు అంత పనికిరాకపోయాయా! రోజు కొక కొత్తకోక కట్టేస్తే అవి ఎంతకాల ముంటాయే? పైగా వారాని కో పొడరుడబ్బా,నూనెసీసా—ఇక ఈకాపరం గుణ్ణమయినట్టే. ఏంవేషాలమ్మా– పాడువేషాలూ– వల్లుబలిసిన వేషాలూ!" అంటూ నడుంవాల్చింది.

బిక్కమొగంవేసుకుని గదిలోకెళ్ళేసరికి ఆయన "నువ్వెప్పుడూ యింతే, ఏదో ఒక గోలతేపుతావు" అని పళ్లుబిగించాడు. సుశీల "ఇప్పుడు నే నేం చేశానండీ—అన్నిటికీ నన్నే అంటా రేం ధర్మమండీ" అంది. "ఇంకా సిగ్గులేక వాగుతావెందుకు—పడుకోక" అని గదిమాడు భర్త. గుడ్ల నీరు కుక్కుకుంటూ ప్రక్కమంచంమీద పడుకున్న దేగాని కంటిమీద కూరుకుపడితే ఒట్టు.

[11 వ అధ్యాయంలోని ఏడవ పేరానుంచీ ఇక్కడ కలిపి చదివితే (పేర్లుమార్చుకొని) ఈ కథ పూర్తి అవుతుంది.]

♦ ♦ ♦ ♦

ఇప్పుడు కథకూ కథానికకూ గలభేదం మరింతస్పష్టంగా మీాకు తెలుస్తుంది. ఈవిధంగా ఆ కుటుంబజీవితంలో మరికొన్ని సంఘటనలనుకూడా చిత్రించినా అది 'కథ' యే అవుతుంది. కాని, ప్రతి సంఘటనా కథలో వుద్దేశింపబడిన ఒకే

ప్రయోజనం కోసం రచింపబడాలి. అంటే అత్త, భర్తల మనస్తత్వాల కారణంగా కథానాయకి ఓర్పునశించి- తెగించి విడిచిపోసిద్ధపడిందన్న విషయాన్ని స్పష్టపరిచేందుకు మాత్రమే ఎన్ని సంఘటనలైనా రచించాలి గాని—ఆ వ్యక్తుల మరొక రకపు మనస్తత్వాలనుగాని, మరొకరకపు జీవితదృశ్యాలను గాని చిత్రించే సంఘటనలు రచింపరాదు. అలా విభిన్న ప్రయోజనాలుగల అనేక సంఘటనలు రచించినట్లయితే అది 'కథ'ను మించి "నవల" అయిపోతుంది.

అయితే- ఈ అధ్యాయంలో మీరు చదివిన కథకూడా కొంత విమర్శన చేసుకోవలసిందిగా వుంది. ఈ కథలో రెండు ప్రయోజనా లుద్దేశింపబడినట్లు మొదటిసారి చదవగానే అనిపిస్తుంది. ఒకటి సుశీల కుటుంబవిసర్జన చేయడానికి హేతువులు చూపించడం. రెండవది ఆమె సంఘమర్యాదలకు తలొగ్గి మరల తిరిగిరావడానికి కారణాన్ని చిత్రించడం.

ఇలా రెండు ప్రయోజనాలున్నాయి గనుక— అది "కథ" కాదు, 'నవల' ఛాయలున్నాయని అనుకోరాదు. సుశీల అనేక బలవత్తరకారణాలవల్ల కుటుంబవిసర్జనకు నిశ్చయించుకున్నా- సతీధర్మాన్ని నిర్వర్తించడమే తన జీవితపరమావధిగా భావించిన సుశీల, ఆదర్శగృహిణి అని చిత్రించడమే యీ కథలోని ముఖ్య ప్రయోజనంగా గ్రహించాలి.

ఎన్ని బలవత్తరమైన ఇతర కారణాలువున్నా— "పతితోడిదే సతిజీవితం" అని నమ్మిన స్త్రీప్రవర్తన ఎలా వుంటుందో, ఎంత తేలిగ్గా సంఘానికి తలొగ్గుతుందో చిత్రించడమే యిక్కడ రచయిత చేసినపని. అందువల్ల ఇది "కథ"

ఇప్పుడు కథాప్రారంభంలో అనేక విధాలుగా వ్రాయడానికి వీళ్ళున్నట్లూ- ప్రయోజనాలనుబట్టి పాత్రలనూ, సంభాషణలనూ, సంఘటనలనూ వివిధ విధాలుగా సృష్టించవచ్చునసీ— పేర్లుకూడా ప్రయోజనభరితాలనీ మీరు గ్రహించారు. ముగింపువిషయంలో కూడా కొన్ని చిన్న చిన్న మార్పులు చూచాం. కాని, ఇంతకంటే కూడా విపరీతమైన మార్పులు చేయవచ్చును.

ఇంతవరకూ కథానాయకి ఎటువంటి మనస్తత్వం గలదైనా చివరికి భర్తమాట విని వెనుదిరిగి కాపురానికి వెళ్ళినట్లే రచించబడింది. కాని, ఈ "కథానిక"లు "కథ"లు దీనికి వ్యతిరేకంగా కూడా ముగించవచ్చు. ఎంత చెప్పినా, బ్రతిమాలినా, భయపెట్టినా కథానాయకి తన నిశ్చయాన్ని మార్చుకోలేదనీ, తన దోవను తాను వెళ్ళిపోయిందనీ చిత్రించవచ్చును. అలాచిత్రించినప్పుడు ఆమెమనసు విరిగిపోయిందని గాని, మంకుపట్టుదలగలదని గాని, సమాజాన్ని ఖాతరుచెయ్యనిదని గాని (ఆ యా కథానికలలో ఆమెకు అంతకుముందుగల మనస్తత్వాన్నిబట్టి యీ మార్పులు) తేలుతుంది.

ఈమాదిరిగా అనేక రకాల ముగింపులుకూడా వ్రాసుకుని ఏ యే కథానికలు, ఏ యే కథలకు అవి తగివుంటాయో చూచుకుని, తగు శీర్షికలుంచి స్వయంకృషికి ప్రారంభిస్తారని ఆశిస్తున్నాము. ఇంతటితో కథల ఉదాహరణలు చాలిస్తూ— స్కెచ్ (గల్పిక, కథనం, చిత్రణ) శిల్పాన్ని పరిచయం చేసుకుందాము.

---

## 15

"హావ్వ!" అని నోరు నొక్కుకుంది ఓ పండు ముత్తయిదు.

"సిగ్గుచేటు" అంది ఓ ముసలమ్మ.

"మంచీచెడ్డా లేదమ్మా- ఈ చదువుకున్న వాళ్ళకి" అంది ఒక అర్ధణాబొట్టు.

"పైగా తమకే అన్నీ తెలుసునని మహాగర్వం- ఈ కాలపు ఆడాళ్ళకి" అన్నాడు పన్నుగర్ర.

"పిదపకాలం- కలికాలం" అన్నాడు చుట్టకాలుస్తున్న పెద్దమనిషి.

"ఛీ- బజారు కెక్కడమా, ఎంత యిదైతేమాత్రిం" అంది కొత్త పెళ్ళికూతురు.

"పైగా నాతో- పతితోడిదే సతికి పరమస్వర్గం చెల్లీ- అని చెప్పేది- సీతులు!" అంది ఓ యువతి.

పదుగురూ బజారులోని ఆ దృశ్యాన్ని చూస్తూ పది రకాలుగా సీతని విమర్శిస్తున్నారు.

సీత కాపురానికి వచ్చిన క్రొత్తలో, అంటే పదేళ్ళ క్రితమైతే వీళ్ళంతా యిలా అనేవాళ్ళేనా? అంతదాకా అక్కర్లేదు- పదిగంటలుకూడా కాదు పది నిముషాలకు ముందైనా వీళ్ళు ఇలా అనుకునేవారు కాదు.

అప్పుడయితే—

ఆ పంచు ముత్తయిదువ—"ఆహా! ఏంగుణం!" అనేది.

ఆ ముసలమ్మ—"రెండువంశాలకీ పేరు తెచ్చింది" అనేది.

ఆ అర్ధణాబొట్టు— "ఎంత చదువుకున్నదైనా కాసంత గర్వంకూడా లేదు. ఎంత అణకువా, ఎంత ప్రేమ!" అనేది.

పన్నుగ్రాయన 'ఆడదంటే అదిరా. నిజంగా సీతామ్మ వారు' అనేవాడు.

"అందుకనే లోకం యిట్లాగయినా బతుకుతోంది. లేక పోతే ఏనాడో బుడుంగుమనేది." అనేవాడు చుట్టాయన.

"ఆమెగారిది ఎంతగుట్టూ, ఎంత ముచ్చటైనకాపరం!" అనేది కొత్త పెళ్ళికూతురు.

"చెప్పే నీతులాచరించే ఒకే ఒక పతివ్రత" అనేది యువతి.

అయితే, ఇంతలో ఇంతమార్పుకు కారణం?

* * *

ఆఫీసునుంచివచ్చి, కాళ్లూచేతులు కడుక్కోనేందుకు చెంబు వెదుక్కుంటున్న శంకరంతో, తల్లి గంగమ్మ—"ఆ రాణీగారు, చెంబుతో నీళ్ళియ్యడానిక్కూడా తీరుబడిలేకుండా వుందిట్రా? మరీ అబ్బురంగావుందే దానిపనీ" అంది విస్తరి కుడుతూ.

"లేదత్తయ్యా, పూలచెండు కడుతున్నాను"

"అవునమ్మా—నీకు పూలేగా కావలసింది. పగలంతా సతమతమై వచ్చిన మొగా డెట్లాపో తేనేం—నీకు రోజుకు పావలా పువ్వులుంటే చాలు"

"రోజూ ఎక్కడ త్తయ్యా—నెలకో రెణ్ణెల్లకో ఒకసారి, అదయినా ఆయన తెస్తేనేగా"

"లేదులే—రోజూ కొని కొంపగుణ్ణంజెయ్యి. అయినా నీళ్ళిచ్చే తీరికే లేదూ? ఎవరు చేస్తారనుకున్నావ్—నీయబ్బ గాడూ?"

"అంత మా టెందుక త్తయ్యా, నీళ్లు నేనిస్తానంటే ఆయన గారే 'ముందు తయారవు; సినిమాకు వేళయిం'దన్నారు"

"ఓయబ్బ! ఇదంతా సినిమా ప్రయాణమన్న మాట. మొగవాడు ఏదో అంటే ఠింగురంగా అంటూ నువ్వుకూడా తయారన్న మాటా! ఏం పగలబాటదీ—అందుకనే సంసారం యిట్లా తగలడుతూంది"

"అయ్యయ్యో! నేనేం చేశా న త్తయ్యా—అనవసరంగా న న్నట్లా అంటా రేం!"

"ఇంకా సిగ్గులేక ఎదురుకూడా చెబుతున్నావూ?—చూడరా దాన్ని, నా కే ఎదురు చెబుతూందీ"

"పోవే నువ్వు యింట్లోకీ- వెధవ్వాదనా నువ్వూనూ"

"అయ్యో, మీరూ నన్నే గద్దిస్తున్నా రా?"

"ఏం, అరిగిపోయావా? పోనీ నన్నే గద్దించూ"

"నేనా? అలా కలలోనైనా అనగలనా?"

"అబ్బో! ఏం నంగనాచిరా—నిలబడి అట్లా లాయరు ప్రశ్న లేస్తున్నదేగాని, కదిలిందా అక్కణ్నుంచి?"

"ఛీ! నీకు మరీ చిన్నా పెద్దా లేకుండాపోయింది. తగలడ్డేం, అవతలికి?"

"అనండి అనండి. ఎంత అణగిమణగివున్నా, ఎన్ని ఓర్చుకున్నా యీ ఆరళ్ళూ, గద్దింపులే ప్రతిఫలం."

"హవ్వ! ఎలా సాధిస్తూందో చూశావటోయ్? మనం రాచి రంపానపెడుతున్నాం గావాల్ను. ఇంకేముందీ— ఈ కాపరాన్ని పదిమందినోళ్ళలోనూ నానవేశేటట్టుంది"

"అలా ఆలోచించి సహిస్తూండబట్టే—నా బ్రతుకు యిట్లా అయింది. నే నెందు కిట్లా బ్రదికి? పదేళ్ళలో ఒక్కనాడన్నా సుఖంలేని ఈ కాపరం ఎందుకూ?"

"ఏమిటీ, మాతో కాపరమే పనికిరాలేదటే నీకూ? చూచావటోయ్ ఆ పొగరు"

"పొగరుమాటల కేం - అంత యిష్టంలేకపోతే తెగతెంపులు చేసుకోకపోయావ్?"

"చేసుకుంటాను. మీ కెంత ఎక్కువయినా, మా కన్నా రింత తిండి వెయ్యకపోరు."

"ఘో ఘో, ఎవర్ని బెదిరిస్తావే?"

"ఛీ! ఇంటికొచ్చేసరికి రోజూ ఏదో ఒకగొడవ." దీనికంటే తెంపు జేసుకుంటేనే హాయి"



సీత నోట్లో చెంగు కుక్కుకుని, పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ బస్టాండుకు నడుస్తున్నది. పదిగజాలు నడిచేసరికి శంకరం పరిగెత్తుకువస్తూ—

"ఆగూ—ఆగవోయ్"

'...............'

"ఆగమంటూంటే, నీకాదూ...పద- వెనక్కి"

"ఊహుఁ... రాను"

'చెబుతూంటే వినవేం ... నా మాట విను. ఇంటికి వెళదాం రా"

"నేన్రాను. నీ అంటేపోయి, 'దూ'అంటే వచ్చేందుకు నే నేం కుక్క ననుకున్నారా!"

"సీతా—ఎందుకు చెబుతున్నానో గ్రహించు...అటు చూడు - పదుగురూ మనల్ని చూచి నవ్వుతున్నారు. ఇంత కాలమూ ఓర్చుకున్నావు...ఈ తొందరపాటు వద్దు - ఇది మనిద్దరికీ నగుబాటు... నే చెబుతాగా - రా"

పమిట చెంగు తలనిండా కప్పుకుని, ముఖం దించుకుని కుంగిపోతూ—'సరే...పదండి' అంది.

♦ ♦ ♦ ♦

ఇప్పుడు—

"ఆహా! ఎంతమంచిబుద్ధి!" అంది పంతు ముత్తయిదువ.

"నిజంగా సీతామ్మవారు" అంది ముసలమ్మ.

"కాకపోతే ఆ అత్త ఆరళ్ళకి ఎప్పుడో తెగతెంపులు చేసుకునేది" అంది అర్థణాబొట్టు.

"భర్తకూడా అనవసరంగా అంటూంటే యీకాలంలో ఏ ఆడదైతే పడుతుందిరా- మహాతల్లి!" అన్నాడు పన్నగరి.

"అలాంటివాళ్ళవల్లే ననుకో- ఈ లోకంలో యింకా ధర్మం నిలిచింది" అన్నాడు చుట్టాయన.

లోకం—కాకిలోకం—గాలివాటం.



ఇది "కథనం." ఇందులో ముఖ్యపాత్రలను గురించి యితరు లనుకునే సంభాషణల కెక్కువ ప్రాధాన్యత ఈయ బడింది. ముఖ్యపాత్రలద్వారా పైవారి భావాలకుగల కారణా లను రాబట్టడం మాత్రమే జరిగింది. ఇలాటి"గల్పిక"కు "కాకి లోకం" వంటి పేరులు బాగుంటాయి.

ఈ 'చిత్రణ'లోకూడా ముఖ్యపాత్రలు పేర్లకు తగినట్లు చిత్రించబడినాయి.

ఈ గల్పికలో సీత కుటుంబాన్ని త్యజించడానికి గల కారణం చూపించే ఘట్టం మాత్రమే ప్రత్యేకంగా రచించినా అది మరొక "గల్పిక" అవుతుంది. చివరికి ఆమె భర్తననుస రించిన ఘట్టం ప్రత్యేకించినా అదొక "గల్పిక" అవుతుంది.

కాబట్టి "గల్పిక"లోని ముఖ్య లక్షణాన్ని యిప్పుడు మీకు గ్రహించవచ్చును. కథానిక, కథలలో ఆయావ్యక్తులు, సంఘటనలద్వారా - కథకుని పరిచయవాక్యాలద్వారా ప్రయోజనం సాధించబడుతుంది. "గల్పిక"లో అంత లోతుకు పోకుండా సూచనప్రాయమైన సంభాషణలతోనే గాని, ఇతరుల

అభిప్రాయాలతో గాని, ఈ రెండింటితోనూ గాని ప్రయోజనం సాధించబడుతుంది.

సీతజీవితంలో రెండుమూడు సంఘటనలను వరుసగా సంభాషణలతో చెప్పడంవల్ల "గల్పిక" ఏర్పడుతుంది. లేదా ఆ సంఘటనలను గురించి ఇతరులన్నమాటలు కలిపినా "గల్పిక" తయారవుతుంది,

మరొక ఉదాహరణ చూడండి.

# 16

మీారు చెప్పండి—

భర్త వచ్చేసరికి ఏ ఆడదైనా ఎంత 'యిది' గా వుండాలి. పగలంతా పనిపాటుల్లో సతమతమై వచ్చిన మగ వాడికి ఏంకావాలో, ఏమిటో అజ కనుక్కొని చూడొద్దూ? వాడొచ్చేసరికి ఈబిడగారు రాణీలా పూలుగుట్టుకుంటూ కూచుంటే—వాడు ముఖంకడుక్కోడానికి చెంబుకోసం వెదుక్కోలేక నానా అవస్థా పడుతూండె. కన్నప్రాణం - నా దెలా వూరుకుంటుందీ? అందుకని కాస్త భయంచెప్పాను.

అయినా, నే నన్న మాటల్లో తప్పేమిటి- "రాణీగారికి నీళ్ళిచ్చే తీరుబడికూడా లేదా ఏమిటా?" అన్నాను. దానికే చిలవలు పలవలుగా ఎదురుచెప్పా స్తే ఎవరై తేమాత్రం 'పూలకీ సినిమాలకీ కొంప గుణ్ణం అవుతూంది' అనుకోకుండా వుంటారా? పైగా వాడే తెచ్చినట్లూ, తనమాట సాగనట్లూ కొండేలూ, నంగనాచి కబుర్లూనా? అదేమంటే నా నోరు మంచిదికాదంటారుగాని, ఎవరికోడలి నెవరు నెత్తినెక్కించు కున్నారూ?

అసలు నాకు మాటదాచుకోవటమంటేనే గిట్టదు. వున్న దేమిటో మొఖానే అనేశాను—"ఈ యింట్లో నే నున్నంత వరకూ నా మాట సాగవలసిందేగాని, ను వ్వెంత గింజుకున్నా లాభంలే"దని. దానికే ఇంత రాద్ధాంతమా? ఇందులో నే నేం తప్పుమాట అన్నానో మీారేచెప్పండి.



అబ్బబ్బ ! ఆఫీసులో నానా అవస్థాపడి యింటికొచ్చే సరికి ఏదో ఒక గొడవయితే ఎట్లాచచ్చేది? అటు తల్లీ సరిపెట్టుకోదు; ఇటు భార్యా నోరుమూసుకోదు. ఏదో ముసలమ్మగదా, ఆమెవాజ అలాంటిది అని సరిపెట్టుకోమంటే—'సీత'—తాను సరిపెట్టుకుంటూనేవున్నా, పెదవికదిపితే అపరాధం అవుతున్నదనీ, పలక్కపోతే గర్విష్టి, ముంగమూచి అనే నిందలనీ ఏడుస్తుంది.

ఏదో, ముసలమ్మనంటే మరీ రాద్ధాంతం చేస్తుందని సీతని కసిరితే - అది "అనవసరంగా నన్ను ఆరళ్ళా, గద్దింపులతో నరకంలోకి తోస్తున్నా" రంటుంది. నన్నెవరూ అర్థ చేసుకోలేకపోతె నే నేం జెయ్యను? అయినా, మగవాడి ఎదట అంతవాదనకూడదని గదిమితే, ఇదేమో జీవితంలో సుఖమనేది లేదనీ, పుట్టింటికి పోతాననీ ఏడ్వడమా? ఆడదన్నాక అనేకం ఓర్చుకుంటూ పడుండాలిగాని, యిదేమిటి?

ఇందులో నా తప్పందేమో మీరే చెప్పండి



ఊఁఅంటే తప్పా, ఆఁ అంటే అపరాధంగా ఆరళ్ళా సాధింపులూ ఎవరైతే పదేళ్ళపాటు సహించగలరు? అన్నిటికీ సహించాను. ఆయన తల్లిగారికి చెప్పేబదులు నన్నే గద్దించినా, పళ్లుకొరికినా కిక్కురుమనలేదు. ఫలితం? నిత్యనరకం. లోకానికి జడిసే ఇంతకాలమూ ఓర్చాను. అయినా, మంచిపేరు రానపుడు, ఏపనిచేసినా మెప్పులేనపుడు ఎందుకీ సంసారం? అందుకే తెగతెంపులుచేసుకుందామని నిశ్చయించుకున్నాను. నా దోవను నే పోతున్నాను.

అయినా, భర్తను విడనాడటం తప్పేనంటారా? బాధ్యతలూ, న్యాయాలూ, రక్షణలూ ఒక్కరివేనా?

మీరే చెప్పండి.

♦ ♦ ♦ ♦

ఇది "చిత్రణ" కు మరొక ఉదాహరణ. ఇందులో పాత్రలు తమ తమ దృక్పథాలను వివరించి—మంచి చెడులు తేల్చవలసిన బాధ్యతను పాఠకులకే వదిలేస్తున్నాయి.

ఈ రచనను చదివి మనం అందరి మన స్తత్వాలతోనూ సానుభూతి ఏర్పరుచుకుంటాం. కాని. సీతమీద జాలిపడి ఆమె చర్యను సమర్థించడం జరుగుతుంది. అత్తను నిందించిన దానికంటె — భర్త విద్యావంతుడై కూడా ఇద్దరిమధ్యా సఖ్యాన్ని కుదర్చలేనందుకు అతని నెక్కువ నెపపెడతాం.

ఈ భావాలుకలిగిన పాఠకులు తోటికుటుంబాలలోనూ తమ కుటుంబంలోనూ పోలికలు గ్రహించి—"ఒక సమస్యను అన్నికోణాలనుంచీ చూడాలి" అనే సత్యాన్ని గ్రహించి; మేలుగా ప్రవర్తించుకునేందుకు ఈ రచన ఎంతో ప్రేరణ చేస్తుంది. దీనికి "ఎవరిది తప్పు?" "మీరే చెప్పండి" అనే శీర్షికలు బాగుంటాయి.

## నవలిక : నవల

కథను పెంచి, ఒక ప్రయోజనానికే పరిమితంచేయక, అనేకమంది ప్రత్యేకతలనూ, అనేక సంఘటనలలో వారు ప్రవర్తించే విధానాలనూ విపులీకరించే "కథ" నవల—అని ఆంగ్లేయ విమర్శకులు నిర్వచించారు. ఈ నిర్వచనానికి యీ క్రింది లక్షణాలను కూడా జోడించుకోండి.

"నవల"లో ప్రతి ప్రకరణంలోనూ ఒక ప్రయోజనం వుండాలి. ప్రతిప్రకరణంలోనూ "ముందేమి జరుగుతుందా?" అనే నిగూఢత్వం(సస్పెన్సు) ఉండాలి. ఒకరి జీవితాన్ని లేదా ఆ జీవితంలో ముఖ్యభాగాన్ని కథావస్తువుగా తీసుకుని—ఆ జీవితం పోయిన త్రోవల్లో స్పృశించిన యితరులకు కూడా స్పష్టమైన వ్యక్తిత్వాలు సృష్టించాలి. ఇందులో రచయిత విశృంఖలంగా వ్యవహరించవచ్చును. పాత్రలూ, సంఘటనల తోనేగాక, తన అభిప్రాయాలద్వారా, ఇతరుల ఉటంకింపుల ద్వారా తన యిష్టము వచ్చినంత తాపీగా విషయాన్ని చెప్ప వచ్చును.

నవలలో ఒకేవ్యక్తిచుట్టూ గాక, అనేక ప్రముఖుల చుట్టూ సంఘటనలు తిరుగాడవచ్చును. అలాగాక ఒకేవ్యక్తి చుట్టూ తిరిగే సంఘటనలతో వరుసగా కథను చెప్పే నవలను "నవలిక" అంటారు. శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు "ఆంధ్రజ్యోతి" ప్రత్యేకసంచికలో రచించిన "ఆడబ్రతుకు" నవలికకు చక్కని ఉదాహరణ.

ఈ గ్రంథంలో పరిచయమైన కథను నవలికగా వ్రాసేం యూ క్రింది ప్రకరణ సూచిక ఉపయోగపడతాయి:

సీతబాల్యంలో ఒక సంఘటన.
సీతపెండ్లిసమయంలో భావనలు.
సీత కాపురంపెట్టిన కొత్తలో.
సీతను అత్తగారు ఆరళ్ళుపెట్టడం.
సీతను భర్త గద్దించే సంఘటనలు.
సీత మానసికావేదనలు.
సీత సహనాస్ని కోల్పోయిన ఘటం.
సీత నిశ్చయం.
సీత నిష్క్రమణ.
సీత భర్తచే అనునయింపబడుట.
సీత తిరిగివచ్చుట.

గాంతంకావాలంటే చివరి రెండు ప్రకరణాలకుబదులుగా—

సీత పుట్టింట హీనపరచబడుట.
సీత ఆత్మహత్య.

—వ్రాయవచ్చును]

ముఖ్యగమనిక:

ప్రయోజనం, ప్రారంభం, ముగింపు, వ్యక్తిత్వాలు, శైలి (హాస్య, వ్యంగ్య, కరుణ) మొదలైనవాటిని ఒక్కొక్క సారి ఒక్కొకవిధంగా తీసుకుని అనేకవిధాల "కథానిక"లూ, 'కథ"లూ వ్రాయడానికి వీలున్నట్లే "కథనం"లు కూడా అనేకానేక రకాలుగా వ్రాయవచ్చును. ప్రస్తుత గ్రంథం పరిచయమాత్రంగా, ప్రామాణికంగా, సూక్ష్మంగా మీకుఅందించాలని ఉద్దేశింపబడింది గనుక ఇంకా ఎక్కువ రకాల ఉదాహరణలు యివ్వడం సాధ్యపడలేదు. ఈపుస్తకంయెడల విమర్శకులూ, సమకాలికరచయితలూ, ముఖ్యంగా పాఠకులూ చూపే ప్రోత్సాహాన్నిబట్టి రెండవభాగాన్నికూడా ప్రచురించాలని ఆశిస్తున్నాను.

రెండవభాగంలో మరొకరకం కథ తీసుకుని- ఆర్థిక, అధ్యాత్మిక, సాంఘిక, అభ్యుదయ, సహజ, నిరోధక దృక్పథాలతో వివిధరకాలుగా రచించే పద్ధతులను ఇంతకంటే సమగ్రంగా ఉదహరించాను. ఈవిదంగా నేను చేస్తున్నకృషి అందరికి ప్రయోజనకారి కాగలదని ఆశిస్తున్నాను. అయితే, మీరందరూ నా యీ "పరిచయగ్రంథం"లోని బాగోగులను నిర్మొహమాటంగా విమర్శించినప్పుడే నా కృషికి సరైన దోహదం కలుగుతుందని గ్రహించ ప్రార్థిస్తున్నాను. అందరూ తలో ముక్కానీ కార్డయినా వ్రాసి, నా మనవిని మన్నిస్తారనుకుంటున్నాను.

మీ విధేయుడు:

**పోలవరపు శ్రీహరిరావు**